

తిరుమల తిరుపతి దేవస్థానములు
SAPTHAGIRI
సప్తగిరి
సచిత్రమాసపత్రిక
మే 2017 వెల రూ.5/-
శ్రీ భగవద్రామానుజుల
సహస్రాబ్ది జయంతి
విశేష సంచిక
ఆధ్యాత్మిక, జ్యోతిష,
వాస్తు, ఆరోగ్యాది అనేక
విషయాలు తెలుసుకోండి... ఫేస్‌బుక్
మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం
Granthanidhi.
blogspot.in

# ఒంటిమిట్ట (కడపజిల్లా) సీతారాముల కల్యాణోత్సవ కమనీయ దృశ్యమాలిక





ఒంటిమిట్ట (కడపజిల్లా) లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తరపున స్వామివారికి ఫలపుష్పకానుకలు సమర్పిస్తున్న గవర్నరు మాన్యశ్రీ ఈ.ఎస్.ఎల్.నరసింహన్



దేవాదాయ ధర్మాదాయశాఖామాత్యులు పట్టువస్త్రాలు సమర్పించడం!



# భగవద్గీత

**శ్లోకం :** అనన్యచేతా స్సతతం యో మాం స్మరతి నిత్యశః ।
తస్యాహం సులభః పార్థ! నిత్యయుక్తస్య యోగినః ॥

(గీత 8 - 14)



**ప్రతిపదార్థం :** అనన్యచేతః= ఏకాగ్రచిత్తుడై; యః= ఎవడు; మామ్= నన్ను; నిత్యశః= అనుదినం(యావజ్జీవం); సతతమ్= నిరంతరం; స్మరతి= స్మరిస్తాడో; పార్థ= అర్జునా; అహమ్= నేను; తస్య= ఆ; నిత్యయుక్తస్య=సమాహితచిత్తుడైన; యోగినః=యోగికి;సులభః= సులభుణ్ణి.

**భావం :** ఎవడు అనన్యచిత్తుడై నన్ను యావజ్జీవం నిరంతరం స్మరిస్తుంటాడో, సదా సమాహిత చిత్తుడైన ఆ యోగికి నేను సహజ లభ్యుడను.

---



# దాచుకో నీపాదాలకు....

దాఁచుకో నీపాదాలకుఁ దగ నేఁజేసిన పూఁజలివి
పూచి నీ కీరితి రూప పుష్పము లివి యయ్యా

వొక్కసంకీర్తనే చాలు - వొద్దికై మమ్ము రక్షించఁగ
తక్కినవి భండారాన - దాఁచి వుండనీ
వెక్కసమగు నీనామము -వెలసులభము ఫలమధికము
దిక్కై నన్నేలితి విక నవిఁ తీరనినా ధనమయ్యా

నా నాలికపై నుండి నానా సంకీర్తనలు
పూని నాచే నిన్నుఁ బొగడించితివి
వేనామాల వెన్నుఁడా వినుతించ నెంతవాఁడ
కానిమ్మని నాకీ పుణ్యము గట్టితి వింతేయయ్యా

యీ మాఁట గర్వము గాదు నీ మహిమే కొనియాడితిఁగాని
చేముంచి నా స్వాతంత్ర్యము చెప్పిన వాఁడఁనుగాను
నేమానఁ బాడేవా డను నేరములెంచకుమీ
శ్రీమాధవ నే నీదాసుఁడ - వేంకటేశుఁడవయ్యా

(సంపుటం - 02, సంకీర్తన - 338)

అన్నమయ్య భక్తి ఆవేదనగా మారింది. ఆ వేదన కన్నీళ్లుగా మారింది. ఆ కల్మషం లేని కన్నీళ్లు ఈ కీర్తనలోని మాటలుగా మారాయి. "స్వామీ! నేను వ్రాసిన ఈ వేలాది కీర్తనలు నీకు చేసిన పూజలు. ఈ కీర్తనలు నీ కీర్తి రూపంలో ఉన్న వికసించిన పువ్వులు. వీటిని భద్రంగా నీ పాదాల దగ్గర దాచుకో.

ఈ వేలాది కీర్తనలలో మాకు అనుకూలమై మమ్మల్ని రక్షించటానికి ఒక్క సంకీర్తన చాలు. అదొక్కటి మాకు వదిలేసెయి. తక్కిన వాటిని నీ ఖజానాలో దాచిపెట్టుకో. స్వామీ! నీ పేరు ఎంత విలువైనదయ్యా! నీ పేరుకు వెల తక్కువ! పనితనం ఎక్కువ! నాకు దిక్కుగా ఎన్నోసార్లు రక్షించావు అయ్యా! ఇకపై నీ సంకీర్తనలు భవిష్యత్తులో నాకు తరిగిపోని సంపదలు.

ఓ వేయి పేరులున్న విష్ణుడా! నా నాలిక మీద ఉండి ఎన్నో కీర్తనలు శ్రద్ధతో నా చేత రాయించి పొగిడించుకున్నావు. నిన్ను పొగడడానికి నేనెంత వాడిని? నా మీద నీ దయ ఎంత ఉందో చెప్పలేను. అందుకే సంకీర్తనలు వ్రాసి పుణ్యం వచ్చేట్లు చేశావు.

ఓ లక్ష్మీనాథుడా! ఈ మాటలు నేను గర్వంతో పలకడం లేదు. నీ గొప్పతనాన్నే పొగిడాను. నేనింతటి వాడినని అహంకరించి నా ఆత్మప్రత్యయాన్ని ప్రకటించుకోలేదు. జీవితాంతమూ ఒక నియ మానికి కట్టుబడి పాటలు పాడేవాడిని. నా తప్పులు లెక్కబెట్టకయ్యా! నేను నీకు దాసుడను. నీవు నా పాపాలు పటాపంచలు చేసే వేంకటేశుడవయ్యా!"

## భక్తుల సేవలో...

# ‘గోవింద తిరుమల తిరుపతి దేవస్థానమ్స్’ యాప్




ప్రపంచవ్యాప్తంగా ఉన్న శ్రీవారి భక్తులకు మరింత చేరువయ్యేందుకు ‘గోవింద తిరుమల తిరుపతి దేవస్థానమ్స్’ యాప్ ప్రారంభం. ఈ యాప్‌ను మార్చి 29వ తేదీన ఉగాదిరోజున తి.తి.దే. కార్యనిర్వహణాధికారి డా॥ డి.సాంబశివరావు ప్రారంభించారు. టి.సి.ఎస్. సహకారంతో రూపొందించిన ఈ మొబైల్ యాప్ ద్వారా భక్తులు వేగంగా, సులభంగా ఎక్కడి నుంచైనా సేవలను పొందవచ్చు.

ఇందులో ఈ-హుండీ, ఈ-డొనేషన్, రూ.300/- దర్శన టిక్కెట్ల బుకింగ్ సదుపాయాలు ఉన్నాయి. దశలవారీగా తి.తి.దే. సేవలన్నింటినీ ఈ యాప్‌ను డౌన్‌లోడ్ చేసుకోవచ్చు. తి.తి.దే. వెబ్‌సైట్‌కు 33 లక్షల మంది యూజర్లు ఉన్నారు. కావున, వీరందరూ ఈ యాప్‌ను డౌన్‌లోడ్ చేసుకోవచ్చు.

## మీ మాట

### కనులవిందు

సప్తగిరి మాసపత్రిక రంగుల్లో ప్రతినెలా కనులవిందుగా వెలువడుతూంది. వ్యాసాలు చాలా సప్రమాణంగా అనేక విషయాలతో ఉంటున్నాయి. ‘గృహలక్ష్మి’, ‘వైకుంఠపాళి’ శీర్షికలు ఎన్నో విషయాలను తెలియజేస్తున్నాయి. రచయితలకు, పత్రికాసిబ్బందికి ధన్యవాదాలు.

*– ఎం. రాధిక, తిరుపతి.*

### బాగుంటున్న ధారావాహికలు

సప్తగిరిలో ప్రతినెలా వెలువడుతున్న ‘పరమయోగి విలాసం’, ‘కైంకర్యమే తనువుదాల్చితే...!’ ధారావాహికలు మాకు ఎన్నో విశేషాలను తెలియజేస్తున్నాయి. ముఖ్యంగా ‘పరమయోగివిలాసం’లో ఆళ్వారుల దివ్యచరిత్రలు ఏనెలకు ఆ నెల ఆసక్తి గొలుపుతున్నాయి.

‘కైంకర్యమే తనువుదాల్చితే...!’ లో భగవద్రామానుజుల జీవితచరిత్ర ప్రణాళికాబద్ధంగా ఆయా ఘట్టాల గురించి చాలా చక్కగా వస్తోంది.

*– కె. రాధ, శ్రీకాళహస్తి.*

## 2017 జూన్ నెల ఉత్సవాలు, పర్వదినాలు

- 05-09 శ్రీపద్మావతీ అమ్మవారి తెప్పోత్సవాలు
- 06-14 అప్పలాయిగుంట, ఋషికేష్, నారాయణవనం బ్రహ్మోత్సవాలు
- 07-09 తిరుమల శ్రీవారి జ్యేష్ఠాభిషేకం
- 29 మరీచిమహర్షిజయంతి

తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక

# సప్తగిరి

సంపుటి : 47 మే, 2017 సంచిక : 12



వేంకటాద్రిసమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన ।
వేంకటేశ సమో దేవో న భూతో న భవిష్యతి ॥



సప్తగిరి మాస పత్రిక

ఇతర వివరాలకు
0877-2264543

విడి ప్రతి : రూ. 5/-
సం॥ చందా : రూ. 60/-
జీవిత చందా : రూ. 500/-
విదేశాలకు సం॥చందా : రూ. 850/-

## ఈ నెలలో....



ముఖచిత్రం : అష్టాక్షరీ మంత్రం అందరికీ, అందరిదీ...

వెనుక చిత్రం : తిరుమలకు మోకాళ్లతో నడచివెళుతున్న శ్రీరామానుజులు

# మహనీయులందరూ ఈమాసంలోనే...!

కాలం అనంతప్రవాహం. నది కూడా అనంతమైన ప్రవాహం. నదీస్నానాన్ని గురించి చెప్తూ పెద్ద వాళ్లేమంటారంటే ఏ నదిలోనూ ఒకసారి మించి రెండోసారి స్నానం చేయడం కుదరదంటారు. అంటే అదే కృష్ణానదిలో, అదే గోదావరిలో మళ్లీ స్నానం చేశాం కదా? అని అనవచ్చు. అది సత్యం కాదంటారు పెద్దలు. ఎందుకంటే నీ మొదటిమునకలో ఉన్న జలప్రవాహం రెండోమునక సమయానికి వెళ్లిపోయింది. ఇది ఇంకొక జలసముదాయం. అందువల్ల కాలాన్ని ప్రవాహంగా చెప్పారు పెద్దలు.

సంస్కృతభాషలో కూడా జగత్తు అంటే అనుక్షణమూ మారేది అని అర్థం.

ఈ మారిపోయే ప్రపంచంలో లోకాన్ని పొదివి పట్టుకుని, దీని ఆలనాపాలనా చూడడం ధర్మం బాధ్యత. మారే ప్రపంచంలో మారకూడని శాశ్వతత్వాన్ని నిలబెట్టేది ధర్మం. ఈ ధర్మాన్ని నిలబెట్టేందుకు అనేక యుగాల్లో ఎప్పటికప్పుడు పరమాత్మ అవతరిస్తూనే ఉన్నాడు. మహాపురుషులు లోకానికి విచ్చేసి తమ ప్రబోధంతో లోకాన్ని తట్టిలేపుతున్నారు. ధర్మపథంలో నడిపిస్తున్నారు.

ఈవైశాఖమాసంలోనే ప్రహ్లాదవరదుడైన నారసింహుడు అవతరించాడు.

శ్రీనృసింహస్వామిని 'క్షిప్రప్రసాదుడు' అంటారు. ఆయన ఒకసారి అనుగ్రహించదలచుకుంటే ఒక్క క్షణం కూడా వ్యవధి లేకుండా అనుగ్రహిస్తాడని దాని అర్థం. తనని నిందించినా, అనరానిమాటలన్నా ఓర్చుకున్న పరమాత్మ, తన భక్తుడు, అర్భకుడు అయిన ప్రహ్లాదుణ్ణి కాపాడడానికి అవతరించిన మాసమిది.

అమృతమథనసమయంలో కవ్వమైన మందరపర్వతాన్ని నిలిపి ఉంచకపోతే దేవదానవులు చేస్తున్న అమృతమథనఘట్టం పూర్తయ్యేది గాదు. ఈ ఘట్టాన్ని తన మూపున మోసిన కూర్మావతారమూర్తి అనుగ్రహించింది ఈ మాసంలోనే.

"రామా! నీవు నేలపై నడయాడిన రోజున అయోధ్యవాసులే తరించారు. నీ నామం విని మూడులోకాలు తరిస్తున్నాయి" అని రామనామమహిమను జగద్విఖ్యాతం చేసిన భక్తి సామ్రాజ్యానికి తొలి ఆచార్యుడు హనుమంతుడు ఆవిర్భవించిందీ ఈ మాసంలోనే!

జ్ఞానానికి మితులు, పరిమితులు ఉన్నాయి. భక్తికి ఏ పరిమితులూ లేవు. భక్తి ఒక్కటుంటే చాలు పరమాత్మ అనుగ్రహం పొందడానికి అని ప్రవచించిన భగవద్రామానుజులు అవతరించి వెయ్యిసంవత్సరాలు పూర్తవుతున్నదీ ఈ మాసం లోనే!

పలికినదంతా పాటగా మార్చి తన పదసాహిత్య సంపదను 'దాచుకో నీ పాదాల చెంత!' అని శాశ్వతంగా రాసిచ్చిన అన్నమయ్య, తరిగొండ నృసింహుని తొలినాళ్లలో ఆరాధించి తిరుమల చేరిన యోగిని, ఆధ్యాత్మికవేత్త, తపస్విని, అనేక యక్షగాన, ద్విపద, పద్యకావ్యాలను జనరంజకంగా రచించిన భక్తకవయిత్రి అయిన మాతృశ్రీ వేంగమాంబ అవతరించిందీ ఈమాసంలోనే!

కర్ణాటక సంగీతసామ్రాజ్యాన్ని సుసంపన్నం చేసిన త్యాగరాజస్వామి వారికి మన తిరుమలేశునితో ఒక ప్రత్యేకఅనుబంధముంది. అయన తిరుమల క్షేత్రాన్ని సందర్శించినప్పుడు 'తెరతీయగరాదా' 'వేంకటేశ నిను చూడ' అని రెండు అమృతగుళికల వంటి కృతులు రచించారు. వారి 250వ జయంతి తిరుమల తిరుపతిదేవస్థానం తిరుమలలో ఘనంగా నిర్వహిస్తున్నది.

దశావతారాలలో తొలిరెండు అవతారాలు జలచరాలు. మత్స్యకూర్మావతారాలలో శ్రీమహావిష్ణువు దుష్టశిక్షణ, శిష్టరక్షణ నిర్వహించాడు. మత్స్యావతారంలో వేదాలను ఉద్ధరించగా, కూర్మావతారంలో మందరపర్వతాన్ని తన వీపుపై ఉద్ధరించి క్షీరసాగరమథనానికి భూమిక అయి నిలిచాడు. ఈ అవతారం మానవులకు అందించే సందేశం అద్భుతం.

ప్రతిమానవునిలో ఆసుర - దైవిక గుణాలుంటాయి. దేశకాలపాత్రలను అనుసరించి అవి మారుతాయి. చెడు ఆలోచన ప్రకోపించినప్పుడు ఒక్క క్షణం ప్రశాంతంగా ఆలోచిస్తే దానిలో దోషం తెలుస్తుంది. శ్రీమహావిష్ణువు దేవతలను అమృతంకోసం క్షీరసాగరం మథించమని చెప్పాడు. మన మనస్సే క్షీరసాగరం. ధ్యానమనే మందర పర్వతంతో మనస్సును మథించాలి. ధ్యానం నిలకడగా లేకపోవడానికి నిదర్శనమే మందరపర్వతం పడిపోవడం. ఆ పరమాత్మను ఏకాగ్రతతో కొలిస్తే తానూ సహకరిస్తాడు. మానవప్రయత్నం అనేది జరిగితే ఆ తర్వాత పరమాత్మ సహకారం లభిస్తుంది. తద్వారా లక్ష్యాన్ని చేరుకొంటాం.

కూర్మావతార ఆవిర్భావం గురించి పోతన భాగవతంలో అష్టమస్కంధంలో గంభీరంగా వర్ణించబడింది. విష్ణుని ఆదేశం మేరకు దేవతలు రాక్షసుల చెలిమికోరారు. దేవదానవులు ఇరువురు మందర పర్వతాన్ని అతి కష్టం మీద తెచ్చే ప్రయత్నం చేశారు. మందరం మోయలేక కొందరు హతాశులయ్యారు. దిక్కు తోచని స్థితిలో వారు విష్ణునామస్మరణ చేశారు. గరుడ వాహనారూఢుడై స్వామి మందరపర్వతాన్ని బంతి వలె తెచ్చాడు. వాసుకిని తాడుగా చేసి మందరపర్వతానికి చుట్టి దేవదానవులు సముద్రమథనానికి ఉపక్రమించారు. దేవతలు తోకభాగాన్ని, రాక్షసులు శిరోభాగాన్ని పట్టుకొన్నారు. మథనం ప్రారంభమైంది. ఒక్కసారిగా పర్వతం సముద్రంలో మునిగిపోయింది. దేవదానవులు సిగ్గుతో చతికిలపడ్డారు. అది గమనిస్తున్న విష్ణువు తాను కూర్మరూపాన్ని ధరించాడు. బ్రహ్మాండాన్ని ఆహ్వానించే ముఖగహ్వరం, సమస్తచరాచర జంతువులను మ్రింగగల మేటికడుపు, విశ్వమంతా తన పైన పడినా కదలని కాళ్లు కలిగిన రూపమది.

మందరపర్వతాన్ని కూర్మం తన మూపుపై ధరించింది. సముద్రమథనం ఆరంభమైంది. దేవదానవులు అట్టహాసంగా చిలుకుతున్నారు. ఆశ్చర్యజనకంగా హాలాహల విషం అందులోంచి బయటపడింది. దాని బారినుండి రక్షించమని 'కుయ్యో! మొర్రో' అని బ్రహ్మాదులు శివుని సన్నిధికి వెళ్లారు. నీవే దీనిని లయింపజేయాలని ప్రార్థించారు.

సర్వమంగళ తన మాంగల్యం మీద నమ్మకంతో హాలాహలాన్ని మ్రింగమని చెప్పింది. సురసంఘాల జయ జయధ్వానాల మధ్య శివుడు ఆ హాలాహలాన్ని జంబూఫలం వలె స్వీకరించి హేలగా నిలిచాడు. మెడలోని పాపసరులు కదలలేదు. శరీరానికి చెమట పట్టలేదు. శిరస్సుపై చంద్రుడే మాత్రము కదలలేదు. శివుడు ఆ విషాన్ని కంఠబిలంలో సూక్ష్మఫలం వలె నిలిపాడు ఆశ్చర్యజనకంగా.

సురాసురులు తిరిగి పాలకడలి తరచడం మొదలెట్టారు. దేవసురభి జనించింది. దానిని దేవర్షులు స్వీకరించారు. ఉచ్చైశ్రవాన్ని బలిచక్రవర్తి తీసికొన్నాడు. ఐరావతం ఉద్భవించింది. కల్పవృక్షం, అప్సర సమూహం బయటకి వచ్చారు. ఆ పైన చంద్రుడు వెలిశాడు.




మే, 10న శ్రీకూర్మ జయంతి సందర్భంగా...

# మందరోద్ధార! నమో నమో!!

- డా॥ రేవూరు అనంత పద్మనాభరావు

అందులోంచి అద్భుత సౌందర్యరాశియైన లక్ష్మీదేవి ఆవిర్భవించింది. ఆమె విష్ణువును తన పతిగా నెంచి ఆయన మెడలో పుష్పమాల వేసి పూజించింది. ఆపైన అమృత కుంభంతో వేల్పువైద్యుడు బయటికి వచ్చాడు. మోహినీ రూప ధారియై విష్ణువు ఆ అమృతాన్ని దేవతలకు పంచిపెట్టాడు. ఇదీ స్థూలంగా కథ.

## కూర్మక్షేత్రం 'శ్రీకూర్మం'

శ్రీకాకుళానికి 13 కిలోమీటర్లు తూర్పున సముద్ర తీరానికి మూడు కిలోమీటర్ల దూరంలో స్వయంభువుగా శ్రీకూర్మ నాథుడు యుగయుగాల ముందు వెలిశాడు. ఇక్కడ లభించిన క్రీ.శ.1281 శాసనం ఆధారంగా ఈ ఆలయాన్ని పూరీ జగన్నాథ స్వామి దర్శనానంతరం భగవద్రామానుజులు పునఃప్రతిష్ఠితం చేశారు. విజయనగరరాజుల కాలంలో ఈ ఆలయం ప్రశస్తి కెక్కింది.

ఇక్కడ ఆలయం ప్రత్యేకత ముందు, వెనుక ధ్వజ స్తంభాలు ఉండటం. విష్ణుమూర్తి ఆలయం వెనుక పడమరవైపు చూస్తాడు. అందుకని రెండో ధ్వజస్తంభ నిర్మాణం జరిగింది. ఇది చాలా అరుదైన విశేషం.

## ఆవిర్భావం

కృతయుగంలో 28వ మహాయుగంలో ఏడవ మనువైన వైవస్వతుని కాలంలో కూర్మావతారం జరిగిందని ఐతిహ్యం. దీనికొక గాథ ఉంది.

ఒక మహాభక్తుడైన శ్వేతమహారాజు విష్ణుని గూర్చి చాలా సంవత్సరాలు తపోదీక్ష పూనాడు. విష్ణువు ప్రత్యక్షమై ఇక్కడ కూర్మరూపం ధరించి నిలిచాడు. బ్రహ్మదేవుడు ప్రతిష్ఠించి స్వయంగా గోపాలయంత్రం స్థాపించాడు. కూర్మనాథుడు శనీశ్వరునికి అధిదేవత. కావున, ఈ ఆలయ దర్శనంతో శని దోషనివారణ కల్గుతుంది.

ఈ ఆలయం త్రేతాయుగంలో రామరాజ్యానికి ముందే వెలసింది. పురాణప్రసిద్ధ వ్యక్తులెందరో దీనిని దర్శించారు. కొన్ని వేల సంవత్సరాల పూర్వమే ఆలయ నిర్మాణం జరిగింది. ఇప్పటి పునరుద్ధరణ కార్యక్రమం 700 సంవత్సరాలకు ముందు చేపట్టారు. ఈ ఆలయ ప్రస్తావన కూర్మ, విష్ణు, పద్మ, బ్రహ్మాండపురాణాలలో ఉంది. యావద్భారతంలో వెలసిన తొలి కూర్మనాథాలయం ఇది. శివాలయాలలో వలె ఇక్కడ స్వామికి నిత్యము అభిషేకాలు జరగడం విశేషం.

పురాణకాలంలో లవకుశులు, బలరాముడు, దూర్వాస మహర్షి ఈ ఆలయ సందర్శనం చేశారు. వివిధ మత సంప్ర దాయాలకు చెందిన ఆదిశంకరులు, రామానుజులు, నరహరి తీర్థులు, చైతన్యమహాప్రభువు స్వామిని దర్శించారు. ఇక్కడ ఆలయంలో ప్రత్యేకత గర్భగృహంలోకి భక్తుల ప్రవేశం.

## మోక్షస్థానం

మరో విశేషం – కాశీ, పూరీక్షేత్రాలలో వలె ఇక్కడ పితృదేవతలకు పిండ ప్రదానాలు చేస్తారు. నదీ తీరాలలో కలిపినట్లు పుష్కరిణిలో అస్తి నిమజ్జనం కావిస్తారు. అస్తికలు సాలగ్రామాలవుతాయని ప్రతీతి. విష్ణుమూర్తి తన సుదర్శన చక్రంతో శ్వేతపుష్కరిణిని ఏర్పరచాడు. మహాలక్ష్మి ఈ పుష్క రిణిలో ఆవిర్భవించి శ్రీకూర్మనాయికగా పిలవబడుతోంది. ఆమె గరుడవాహనాన్ని అధిరోహించి వరదహస్త ముద్ర ధరించి ఉంది. ఇక్కడి పుష్కరిణీ స్నానంతో సౌరశక్తులు లభిస్తాయి.

## ఐతిహ్యం

మాఘశుద్ధచతుర్థినాడు గంగాదేవి ఈ పుష్కరిణిలో స్నానంచేసి, తనలో స్నానంచేసి భక్తులు వదిలిన పాపాలను ఇక్కడ పోగొట్టుకుంటుంది. ఈ ఆలయంలో ప్రసాదం స్వీకరించి దేవనృత్యాంగన తిలోత్తమ తన కోర్కెలు వీడి భక్తురాలైంది. శుభాంగరాజు స్వామిదర్శనం చేసుకొని వెళ్లి శత్రువులను యుద్ధంలో జయించాడు. వాసుదేవుడనే భక్తునికి పుష్కరిణీ స్నానంతో కుష్ఠువ్యాధి నివారణ అయింది. అనేకానేకమైన గాథలతో, పవిత్రభావనలతో ఈ ఆలయం ప్రసిద్ధికెక్కింది. ప్రదక్షిణ మండపంలోని ప్రత్యేకంగా నేలపై పరచిన రాళ్లు అయస్కాంత శక్తి కలిగి ఉన్నాయి.

ఈ ఆలయంలో కాలభైరవ, వేణుగోపాల, భగవద్రా మానుజ, వ్యాస విగ్రహాలు, మహాలక్ష్మి విగ్రహాలు నిర్మించారు. ప్రధాన ఆలయగోపురాన్ని పద్మవిమానమని పిలుస్తారు. ఆలయం శ్వేతాచలంపై ప్రతిష్ఠించారు. ఫాల్గుణ శుక్ల త్రయోదశినాడు ఉత్తరఫల్గుణీ నక్షత్రంలో ప్రత్యేకసేవ నిర్వహిస్తారు. "కూర్మ జయంతి వైశాఖమాసపూర్ణిమనాడు యథావిధిగా ఉత్సవాలు జరుగుతాయి. ఇదీ శ్రీకూర్మనాథ క్షేత్రవైభవం".

# ఒక బాలుడి కోసం..




ధర్మానికి అంతరాయం కల్గి, అధర్మం ప్రబలినప్పుడంతా- ఒకరితో నిమిత్తం లేకుండా భగవంతుడు తనంతతానే అవసరమైన రూపంలో, తగిన పరికరాలతో, పరివారంతో అవతరిస్తాడు. అవతారమంటే ఉన్నతస్థితిలో, దివ్యలోకాల్లో ఉండే దేవతలు - ఒక విశేషకార్యంకోసం భూలోకానికి దిగిరావడం. ఇలా రావడం మానవులకు ఉత్తమ జీవితఫలాన్నీ, గమ్యాన్నీ నిర్దేశించడానికే! తాను చేసిన సృష్టిపై తనకుండే విశేషప్రేమను ప్రదర్శించడానికి ఇదొక ఉత్తమనిదర్శనం. మానవప్రవృత్తిని బట్టి ఇలా రావాల్సిన అవసరం చాలామార్లు ఏర్పడుతుందని-సర్వజ్ఞుడైన భగవంతునికి ముందే తెలుసు కనుక.

భగవంతుడు లీలావతారుడు కనుక - దేవతా రూపాలతో, వివిధ జంతురూపాలతో, మానవరూపాలతో, చివరకు జడపదార్థాలైన స్తంభాదుల్లో కూడా అవతరిస్తాడు. ఆయా అవతారాలెత్తినపుడు అందుకు అనుగుణమైన ప్రవృత్తికల్గి, కార్యాలుచేసి తాను వచ్చిన ప్రయోజనాన్ని సఫలం చేసుకొంటాడు. మహాభాగవతం పేర్కొన్న 21 అవతారాలలో 14వ అవతారం-నరసింహావతారం.

## నృసింహావతార నేపథ్యం

"పదునాలుగవదియైన నరసింహరూపంబున కనక కశిపుని సంహరించె" అన్నాడు - పోతన. రాక్షసప్రవృత్తి విపరీతంగా పెరిగి ఉన్న సమాజంలో ఉన్న స్థితిని ఎదిరించే ప్రవృత్తి చిన్నగా అయినా బాలుడైన ప్రహ్లాదుడు దైవానుగ్రహంతో జన్మించాడు. ఆ బాలుని మాటను సార్థకం చేయడం కోసం వచ్చిన అవతారం నరసింహం! స్తబ్ధంగా ఉండే- రాక్షసప్రవృత్తిని ఎదిరించే శక్తి లేనట్లుండే- ఆ జడసమాజం నుండే- జడమైన ఒక స్తంభం నుండే దైవశక్తి తగిన రూపంతో, శక్తితో ఆవిర్భవించింది. అసురుడంటే- తన ప్రాణాల్ని తాను కాపాడుకుంటూ - తన చర్యలకు అడ్డం వచ్చిన వాళ్లని నిర్దాక్షిణ్యంగా చంపుతూ ప్రవర్తించే స్వార్థపరుడు. మితిమీరిన భోగలాలసుడు.

జీవులు సుఖశాంతులతో జీవితం గడపడం కోసం, భగవంతుడు ధన కనకాదివస్తువులను సమృద్ధంగా ఉంచి, సృష్టిని నిర్మించాడు. ఆయన ఇచ్చిన భోగసామగ్రిని ధర్మబద్ధంగా అనుభవిస్తూ, జీవితాన్ని కాపాడుకొంటూ, కృతజ్ఞతా రూపంగా భగవంతుణ్ణి సేవిస్తూ కాలం గడపడం యోగ్యమైన పద్ధతి. అలా ధర్మబద్ధమైన అర్థంతో కోరికలు తీర్చుకుంటూపోతే- ఆ జీవి భగవంతుని కృపకు పాత్రుడవుతాడు. అలా కాక - విశ్వమంతా నాదే! నేనే దీనికి ప్రభువును. ఇక్కడి వస్తువులన్నీ నా సుఖాలకే అనే అజ్ఞానంతో పెచ్చుపెరిగి, కామక్రోధజీవనుడైతే - అతడే అసురుడు. అతనిలో రాగం, ద్వేషం మోహాదులు మించి ఉంటుంది. ఇందువల్ల అహంకారం, మమకారం సమాంతరంగా పెరుగుతుంది. పెద్దలపై, గురువులపై, సద్విషయాలపై ద్వేషం ఏర్పడుతుంది. ఈ లక్షణాలు కలవాళ్లలో గొప్పవాడుగా ఉండేవాడు కనుకనే హిరణ్యకశిపునికి 'రాక్షసరాజు' అనే పేరు వచ్చింది. ఐహిక భోగవస్తువుల్లో బంగారు ముఖ్యమైంది. ఈ బంగారునే (హిరణ్యాన్నే) జగమంతా పరచి ఉన్నట్లుగా చూచేవాడు కనుక హిరణ్యకశిపుడయ్యాడు. జీవియొక్క మనఃప్రవృత్తులే అతని సుఖదుఃఖాలకు కారణాలు. ఇవే బంధానికీ, ముక్తికీ ప్రధానసాధనాలు. శాస్త్రం సూచించిన ధర్మమార్గంలో మనిషి

ప్రవర్తించి, దైవీసంపదను సంపాదించుకొంటే ముక్తి పొందుతాడు. అలాకాక వ్యతిరేకంగా ప్రవర్తిస్తే–వ్యతిరేకఫలాలే పొందుతాడు. జీవుని బుద్ధి ప్రకృతిగుణసంబంధంవల్ల దైవీసంపదను, అసురసంపదను– రెంటినీ కల్గి ఉంటుంది. అతని గట్టి కృషి వల్ల దైవీసంపద పెరిగితే–అదే అసురసంపదను నాశం చేస్తుంది. అట్లే అజ్ఞానంతో, అహంకారంతో ఆసురసంపదనే సంపాదించుకుంటే–అది దైవసంపత్తును అణచివేస్తుంది. ఈ విధానంలో ఒకడు దైవీసంపదను పెంపొందించుకొంటుంటే– చూచి, రాక్షససంపదగలవాడు– అసూయతో– దైవీసంపన్నునికి కష్టాలూ, ఇబ్బందులూ కల్గిస్తుంటాడు. ఇలా స్వార్థం కారణంగా దేవతలకూ, రాక్షసులకూ పరస్పరం విరోధం ఏర్పడింది. రాక్షసరాజు మలినమైన అంతఃకరణం కలవాడు కనుక– దేవతల్ని చూచి, ఓర్వలేక–వాళ్లనూ, వాళ్లకు బలం చేకూర్చే ఋషులనూ, యజ్ఞయాగాదులనూ సమూలంగా నాశం చేయబూనాడు – హిరణ్యకశిపుడు. ఇది రాగ ద్వేషాల ఫలం! బుద్ధి పుణ్య రూపమై, శుద్ధతను పొంది, దేవతా లక్షణాలతో వృద్ధి చెందితే– అదే 'ప్రహ్లాద'త్వాన్ని పొందుతుంది. హిరణ్యకశిపుతనం గల్గిన మలినాంతఃకరణం– శుద్ధరూపమై ప్రహ్లాదత్వాన్ని పొందుతుంది. కనుక హిరణ్యకశిపునికి, ప్రహ్లాదుడు పుత్రుడు కావడమంటే– 'ఆత్మావై పుత్రనామాసి' తండ్రి తానే పుత్రరూపంతో జన్మిస్తాడనే వేద వాక్యం– జీవుని యొక్క సంస్కారాన్ని బట్టి ఉంటుంది. దైవీగుణాన్ని ఎదిరించే వానికి ప్రహ్లాదుని లాంటి కొడుకు పుడితేనే ముక్తి. సత్త్వగుణ ప్రధానుడైన ప్రహ్లాదుణ్ణి చూచి, ఓర్వలేక–తమోగుణుడైన హిరణ్యకశిపుడు–కొడుకని కూడా చూడకుండా బాధించడం – గుణ వైరమే!

తమ సంపదను తాను కాపాడుకోవడం దేవతల ధర్మం కదా! శుద్ధసత్త్వుడైన ప్రహ్లాదుడు అస్థిరవస్తువులపై కాక– శాశ్వతమైన వస్తువైన శ్రీహరియందే నిష్కలవాడయ్యాడు. ఇది జన్మాంతర సంస్కారం! కనుకనే శ్రీహరి సర్వకాలాల్లో, సర్వత్ర ప్రహ్లాదుణ్ణి రక్షిస్తూనే వచ్చాడు. చివరకు హిరణ్యకశిపుడు – "నీ దేవుడెంతటి వాడు? ఎక్కడున్నాడు? నాకు చూపిస్తావా?" అంటూ రజస్తమోగుణ ఆధిక్యం వల్ల – ప్రహ్లాదుణ్ణి ధిక్కరించి ప్రశ్నించాడు. ఇందుకు కారణం– తాను తపస్సు చేసి, బ్రహ్మవల్ల పొందిన వరంలో – ఎవ్వరిచేతనూ, ఎక్కడా, ఏ వేళలో, ఏ ఆయుధంతో – ఇలా ఎన్నో నియమాలు పెట్టి, మృత్యువు లేకుండా చేసుకొన్నాననే గర్వం అతనికి ఆపాదమస్తకం ఆవరించి ఉంది. ప్రహ్లాదుని మీది కోపంకంటే – అతణ్ణి రక్షిస్తున్న శ్రీహరిపై అతనికి పగ, కోపం తీవ్రమయ్యాయి. 'వినాశకాలే విపరీత బుద్ధిః' కదా! ఈ విషమస్థితిలో ప్రహ్లాదుడు ధైర్యంగా 'శ్రీహరి సర్వోపగతు'డని నిర్భయంగా చెప్పాడు. భక్తుని మాట సార్థకం చేయడం భగవంతుని కర్తవ్యం కనుక– హిరణ్యకశిపుడు అడిగిన– చూపిన స్తంభంలోనే – వాని పాలిటి మృత్యువై– వాని వర్గాలనన్నింటినీ అతిక్రమించి, 'నరసింహ'రూపంతో ఆవిర్భవించి, అతణ్ణి సంహరించాడు.

> **శ్రీహరి**
> **నృసింహావతారం వ్యక్తమయింది - వైశాఖశుక్ల చతుర్దశి స్వాతి నక్షత్రంనాడు. 14 లోకాలకూ హిరణ్యకశిపుని బాధలు తొలగించడానికేమో శ్రీహరి చతుర్దశి సాయంకాలం అవతరించాడు. మనలోని పంచకర్మేంద్రియాలూ, పంచజ్ఞానేంద్రియాలూ, మనోబుద్ధి చిత్తాహంకారాలూ - తమలోని రాక్షసప్రవృత్తిని పోగొట్టుకోవాలంటే శ్రీనృసింహుణ్ణి ఉపాసించాలి. అన్ని ఆపదలనూ రక్షించగలమూర్తి - ఈ స్వామి.**

## 'నరసింహ' శబ్ద, అర్థ విశేషాలు

'నర' అంటే నరుడు= జీవుడు. సింహ మంటే హింసించేదీ, నాశం చేసేది అని అర్థం. కనుక జీవభావాన్ని నాశం చేసేవాడు నరసింహుడు. మహాభక్తుడైన ప్రహ్లాదుణ్ణి పీడిస్తున్న తుచ్ఛమైన జీవభావాన్ని, తన దివ్యకృపాకటాక్షాలతో చంపేసి, దైవభావాన్ని ప్రహ్లాదునిలో స్థిరపరచడమే నరసింహత్వం! అన్ని అనర్థాలకూ మూలమైన అజ్ఞానమనే శత్రువు నశించందే– జీవులకు పరమసుఖం సిద్ధించదు. కనుక సన్మార్గాన్ని గూర్చి, పరమశత్రువుగా భావించి, పీడించే తమోగుణం, అహంకారం గల ఆసురసంపదను నిర్మూలం చేయాలంటే–శుద్ధసత్త్వమైన సద్బుద్ధే పుట్టాలి. అలాంటి బుద్ధి గలవాడు కనుకనే ప్రహ్లాదుడు దుఃఖస్థానమైన తన జాతివృత్తిపై విష్ణుభక్తినీ, విష్ణుతత్త్వాన్నీ

బోధించాడు. జన్మాంతర సుకృతం వల్ల– గర్భంలోనే అతనికి ఆ విష్ణుభక్తి రక్తంలో జీర్ణించుకపోయింది. అతనికి జన్మతః సర్వత్ర వాసుదేవభావన కల్గింది. భగవద్గీత ప్రకారం 'సర్వత్ర వాసుదేవుణ్ణే దర్శించేవాడు మహాత్ముడు. మహాజ్ఞాని. మహా భక్తుడు. అట్టివాడు సాధారణంగా ఉండడం వీలుకానిది. ఆ స్థితి దుర్లభమైంది' అని చెప్పినా– జన్మాంతరసుకృతం, భగవదనుగ్రహం ఉన్నవాళ్లకు ఈ జన్మలోనే–జన్మించగానే– లేదా గర్భంలోనున్నప్పటి నుండే కూడా అంతటి దుర్లభమైన 'సర్వం విష్ణుమయం జగత్' అని భావన, జ్ఞానం, అనుభవం సిద్ధించడం ఆశ్చర్యమే అయినా – ప్రహ్లాదుని విషయంలో దేవలోకంలో జరిగిన నిర్ణయాన్ని – నారదుని ద్వారా భగవంతుడు సుసాధ్యం, సుఫలం, సఫలం చేశాడు.

హిరణ్యకశిపుడూ జన్మాంతరసుకృతం పుష్కలంగా కల్గి, విష్ణుదేవుని తూర్పు ద్వార పాలకుల్లో ఒకడు జయుడు. ఇతని అన్న హిరణ్యాక్షుడు– ఇతడు విజయుడు. సనత్కుమారాదుల శాప కారణంతో భూలోకంలో పుట్టాల్సి వచ్చింది. విష్ణుదేవుని దయవల్ల– మూడు జన్మలు రాక్షసులై, విష్ణుద్వేషులై, విష్ణువు చేతనే మరణించి, పిదప తమ స్వస్థాన ఉద్యోగులవుతారు. ఇది ఇంకా మొదటిజన్మే! హిరణ్యాక్షుణ్ణి విష్ణువు వరాహ రూపంలో సంహరించాడు. కానీ, హిరణ్యకశిపుని విషయంలో స్వామి ఏదో ఒక రూపంతో కాక– అతడడిగిన మినహాయింపులన్నీ గుర్తుంచుకొని, అన్నిటికీ భిన్నంగా తగినరూపంతో, తగినకాలంలో, స్థలంలో, తగిన ఆయుధాలతో అతణ్ణి చంపాలి. ఇందుకు జన్మించడానికి– స్వామికీ, జన్మ నిచ్చేందుకు ఏ తల్లి దండ్రులకూ అవకాశం లేదు. ఇది దేశకాలరూప అవధులకు అతీతమైంది. ఎప్పుడవసరమైతే ఆ క్షణంలో ఆ రాక్షసుణ్ణి చంపడానికి తగినట్లుగా – ఒక క్రొత్త రూపాన్ని స్థిరపరచుకొని, సూక్ష్మరూపంతో శ్రీహరి అప్పట్నుంచే సిద్ధంగా ఉన్నాడు. అవసరంరాగానే స్థూలరూపంతో ఆవిర్భవిస్తాడు. హిరణ్యకశిపునికీ కొంతకాలం రాక్షసత్వం, అందలి శక్తులూ, యుక్తులూ, దోషాలూ అన్నీ అర్థంకావాలి. అందుకు తగిన పూర్వరంగం ఏర్పడాలి. ఏర్పరచుకోవాలి కూడా! అందుకు సంపూర్ణంగా సహకరించి, చక్కని ప్రణాళికను రూపొందించి, ప్రతిక్షణమూ అదే పనిలో నిమగ్నమై– చివరకు ఈ రాక్షస నాటకానికి భరత వాక్యం పల్కినవాడు – నారదుడు.

నరసింహమూర్తిగా స్వామి అవతరిస్తాడని బ్రహ్మాదులకు కూడా తెలీదు. తెల్పాల్సిన అవసరం విష్ణువుకూ లేదు. నిర్ణీత కాలంలో అంతా, అందరికీ తెలుస్తుంది. అంతే! నరత్వం పాదాల నుండి కంఠంవరకూ. కంఠంనుండి పైభాగం సింహత్వం. నరుడిలోని జ్ఞానం, రౌద్రం, హింసాబుద్ధి, కోపం– పాదాల నుండీ క్రమంగా ఊర్ధ్వ ముఖంగా ప్రసరించి, ముఖంలో సింహముఖరూపంతో నిల్చాయి. చేతులు మామూలుగా కన్పించినా, అవి సింహపు గోళ్లే! అవే ఆయుధాలు. ఆ గోళ్లు వజ్రంతో సమానమైన కాఠిన్యం, వాడీ వేడీ కలవి. నరునికి కోపంతో అతడు సింహమై గర్జిస్తాడు. తన సహజపరాక్రమంతో, బుద్ధి యుక్తులతో సార్వభౌముడవుతాడు. అతనికి దుష్టుల్ని శిక్షించడమూ, శిష్టుల్ని రక్షించడమూ, భక్తితో భగవంతుణ్ణి ప్రసన్నుణ్ణి చేసుకోవడమూ– ఇలా అన్నీ తెలుసు. అవన్నీ మెదడులో – అంటే శిరస్సులో ఉంటాయి. కోపించిన నరుడే– సింహముఖంతో విజృంభిస్తాడు. కనుకనే నరత్వ, సింహత్వాలూ రెండూ కలిసిన ఏకరూపం – నరహరి రూపం. ఏ రూపంతో హిరణ్యకశిపునికి మరణమో– అతడు కోరుకున్న వరాలే నిర్ణయించాయి. ఆ వరాలే స్వామికి ఈ నృసింహరూపాన్ని సిద్ధం చేశాయి.

**బాలగ్రహదోషాలూ,**
**భూతప్రేతాది దోషాలూ,**
**జ్వరతీవ్రతలూ, సంతానంలేకపోవడం,**
**అనారోగ్యం వంటి ఎన్నో కష్టాలనుండి -**
**ఈ స్వామిని సేవించి, గట్టెక్కిన వాళ్లున్నారు.**
**ఇంటి దేవుడుగా, కులదేవతగానూ నృసింహుడు ప్రసిద్ధుడు.**
**ముప్పైకి పైబడి నరసింహ మంత్రాలున్నాయి.**
**నృసింహయంత్రాలూ ఉన్నాయి.**
**ఆంధ్రలోని పెద్దఅహోబలంలో నవనరసింహస్వాములన్నారు.**
**సింహాచలంలో వరాహనరసింహస్వామియై**
**ఉన్నాడు. చాలచోట్ల స్వామి**
**స్వయంభూమూర్తియై**
**విరాజిల్లుతున్నాడు.**

కనుక నరహరి– ఆనాటి నుండే అదనుకై ఇదే రూపంతో కాచుకొని ఉన్నాడు. అప్పట్నుంచే విశ్వమంతా నరసింహుడై విష్ణువు వ్యాపించి ఉన్నాడు.

హిరణ్యకశిపుడు తనకు తానే– వరాలనెపంతో కోరి తెచ్చుకొన్నాడు. 'జాతస్యమరణం ధ్రువం' అనే సృష్టి సిద్ధాంతానికి వ్యతిరేకంగా– ప్రవర్తించడం– అవివేకం కదా! అందుకే తగిన ఫలం అనుభవించాడు. అయితే హిరణ్యకశిపుడు అన్నీ తెలిసిన వాడే– అందుకే మరణాన్ని కోరి– ఇంకెవరియందో కాక – తన పుత్రుని పైన్నే కోపం, ద్వేషం పెంచుకొన్నాడు. అప్పటికే ఎందరో సాధువుల్ని హింసించాడు. యజ్ఞాలు ధ్వంసం చేశాడు. అయినా పాపం పెరుగు తూందే కాని మృత్యువు రావడంలేదు. అందుకే కుమారుడే తన మృత్యువుకు తగినవాడనిపించి, అతణ్ణే హింసిస్తూ వచ్చాడు. కారణం తన మతానికి విరుద్ధంగా ప్రవర్తించడమనేదే– ప్రబల కారణం! తండ్రీ కొడుకు లిద్దరూ – తమ అభిప్రాయాల్ని, మతాన్నీ మార్చుకొనేవాళ్లు కాదు. ఎవరి సిద్ధాంతంలో వాళ్లు స్థిరబుద్ధితోనే ప్రవరిస్తున్నారు. నిజానికి అదే మంచిది. ఫలం ఏదైనారానీ– అనుభవించడానికి సిద్ధంగా ఉండడంలోనే ఆనందం ఉంది. అది మరణమైనా సరే! మహాభాగ్యమే అవుతుంది. కనుకనే విష్ణువు తన భక్తులిద్దరిలోనూ ప్రవేశించి, ఎవర్ని ఎలా రెచ్చగొట్టాలో అలా చేస్తూ వచ్చాడు. వైరంతో రెచ్చిపోయాడు– హిరణ్యకశిపుడు. విష్ణుభక్తితో రెచ్చి పోయాడు–బాలప్రహ్లాదుడు. ఇద్దరూ సఫలీకృతులే అయ్యారు. ఇదే స్వామి సంకల్పం! ఎన్ని కల్పాలు మారినా అన్నీ స్వామి సంకల్పానుసారమే నడచుకొంటాయి.

ప్రసిద్ధ భక్తురాలు - తరిగొండ వెంగమాంబ నృసింహ భక్తురాలు. తిరుమల శ్రీవారి ఆలయంలో - ఈశాన్యదిశలో యోగపట్టంతో ఉండే నృసింహాలయం ఉంది. జానపదులకు నృసింహస్వామి మహాపూజ్యుడు. లక్ష్మీదేవిని చెంచెతగా భావించి, చెంచులక్ష్మితో స్వామి వివాహం జరిపించే పాటలూ, నాటకాలూ, యక్షగానాలు ఎన్నో వచ్చాయి.

ఒకనాటి సభలో తండ్రీకొడుకుల స్వమతావేశం ఉప్పొంగింది. ఎవరికి వారు పందెం కట్టారు. ఆ పందెంలో కుమార ప్రహ్లాదుడు *"ఇందుగలడందు లేడని సందేహము వలదు. చక్రి సర్వోపగతుండెందెందు వెదకి చూచిన అందందే కలడు దానవాగ్రణి! వింటే"* అని నిక్కచ్చిగా చెప్పాడు. 'అయితే నీ హరి ఈ స్తంభంలో ఉన్నాడా?" అన్నాడు. "సర్వత్ర ఉండే నా హరి – ఇంత పెద్ద స్తంభంలో మాత్రం ఎందుకు ఉండడు?" అన్నాడు. కాలం ఆసన్నమైంది. అప్పటికే శ్రీహరి ఆ వాగ్వాద సన్నివేశంలో విశ్వమంతా అగోచరంగా నరసింహుడై ఉన్నాడు. ఎక్కడ కోరితే అక్కడే కన్పిస్తాడు. ఇలా శ్రీహరి స్వయంగా తన మూర్తిని నరసింహమూర్తిగా మార్చుకొని సర్వత్ర ఉండడం– అనేది అద్భుత సంఘటనం. ఆ స్తంభాన్ని హిరణ్యకశిపుడు గదతో కొట్టగానే అవ్యక్తం నుండి వ్యక్తంలోకి వచ్చాడు నరసింహరూప శ్రీహరి. ఆ రూపం అపురూపం. ఆ తేజస్సు, సింహగర్జనం, ఉత్సాహం, పౌరుషం, విరాట్ నరసింహత్వం, యుద్ధసంసిద్ధత – బ్రహ్మాదులకు కూడా ఆశ్చర్యం, భయం కల్గించింది. దేవతలెవ్వరూ ఈ రూపాన్ని మున్ను చూచిందీ లేదు. ఊహించిందీ కాదు. ఆ ఉగ్రత్వం చూస్తే– హిరణ్యకశిపుణ్ణీ, అతని పరివారాన్నే కాక – ముల్లోకాలూ మ్రింగేస్తాడేమో అని కలత చెందారు. ఆయన విష్ణువని గ్రహించారే కానీ–ఈ రూపాన్ని ఎలా అను గ్రహింపజేయాలో, ఎలా శాంతింప జేయాలో ఆలోచించారు. విష్ణువు 'స్తోత్ర ప్రియుడు' కనుక వచ్చిన దేవగణాలందరూ తమకు తోచిన విశిష్టభావాలతో స్తుతించి, శాంతింప జేయడానికి పూనుకొన్నారు. మొదట బ్రహ్మదేవుడు ప్రారంభించాడు. ఆ తర్వాత రుద్రుడు, ఇంద్రుడు, ఋషులు, పితరులు, సిద్ధులూ, నాగులు, మనువులు, ప్రజా పతులు, గంధర్వులు, చారణులు, యక్షులు, కింపురుషులు, వైతాళికులు, కిన్నరులు, విష్ణుపార్షదులూ, స్వామిని "శాంతింపు మని" ప్రార్థించారు. అయినా నరసింహుడు శాంతించలేదు. కాని ప్రహ్లాదుని ప్రార్థనతో శాంతించాడు. ఈ స్వామికథ పురాణాల్లో దర్శన మిస్తుంది. ఉపపురాణాల్లో ప్రత్యేకం 'నృసింహ పురాణం' అని స్వామికోసం ఒక పురాణమే ఉంది. అప్పటికేర్ప డిన అవతారాల్లో నృసింహావతారానికున్నన్ని ఆలయాలూ, భక్తులూ, స్తోత్రాలూ, పూజలూ, మంత్రాలూ, యంత్రాలూ, దండకాలూ తత్పూర్వులకు ఏర్పడలేదు. భారతదేశంలోనే కాక–బంగ్లాదేశ్‌లో మూడుచోట్ల నృసింహ విగ్రహాలున్నాయి. మనదేశంలో ఎక్కువగా ఆంధ్రప్రదేశ్‌లోనే ఉన్నాయి. మనదేశంలో దాదాపు నాలుగు వందల నృసింహాలయాలున్నాయి. 38 శాసనాలలో స్వామివారిని గూర్చిన విశేషాలున్నాయి. ఒక్కొక్క క్షేత్రంలోనూ ఒక్కొక్క విశిష్టత గోచరిస్తుంది.

*(గతసంచిక తరువాయి భాగం...)*

శ్రీరంగనాథుని ఆలయం. స్వామి పాదాలను ఒత్తుతున్నది శ్రీరంగనాయకి. రంగనాథుని పెదాలపై ఒక చిరునవ్వు తళుక్కున మెరిసింది. శ్రీరంగనాయకి జగన్నాథుని ఒక కంట కనిపెడుతూనే ఉంది.

'స్వామీ! చిద్విలాసంగా నవ్వారేమిటి? ఆ నవ్వుకు కారణం చెప్పరా?' అంది. 'నవ్వడానికి ప్రత్యేక కారణమంటూ లేదు. నా భక్తుడు విప్రనారాయణుడు నన్నెంతో భక్తితో సేవించేవాడు. పుష్పకైంకర్యంతో మెప్పించేవాడు. ఆయన కైంకర్యం మానేసి ఒక గణిక వలలో పడ్డాడు. ఆవిడతో సరాసరి వేశ్యావాటికకే వెళ్ళిపోయాడు. రోజులు గడిచాయి. విప్రనారాయణుని గణికతల్లి ధనం గాని, కానుకలుగాని ఏవీ ఇవ్వకపోవడంతో ఇంటి నుండి వెడలగొట్టింది. పాపం! విప్రనారాయణుడు ఒక ఇంటి పంచన పడి నిట్టూరుస్తున్నాడు. అందుకే నేను నవ్వాను' అన్నాడు.

శ్రీరంగనాయకి 'స్వామీ! మీ పాదపద్మాలు సేవిస్తేనే చాలుగా! పాపాలు పోతాయి. మీ దాసునికి నిర్మలాత్మునికి ఇవేం బాధలు కష్టాలు? వీటికి కారణాలేమిటి? ఇదంతా మీ మాయా స్వరూపమా? సూర్యునికి అంధకారమా? భక్తులకు కష్టాలా? ఇదా మీ కీర్తి సౌభాగ్యం? కొడుకుపడే అవమానం తండ్రిది కాదా! నేను విన్నపం చేస్తే గాని మీరు కరుణించరా! తల్లికి లేని ముద్దు దాదికి ఉందా? నన్ను చూసైనా నా మాటలు ఆలకించైనా కుమారుని గట్టెకించవద్దా?' అని బతిమాలింది.

'అరవిందనయనా! విప్రనారాయణుడు సామాన్యుడు కాదు. మహాయోగి. అతనికే మాత్రమూ దుర్జాతిపాపం అంటదు. ఇదంతా నా లీలే. లీలావినోదంలో ఒక భాగమే. విప్రనారాయణుడు వేశ్యావశుడు కావడం. కృష్ణావతారంలో గోపికలతో తిరిగినా వారిపట్ల రాగం ఇంచుకయినా లేదు. నిత్యులకే ఆ శక్తి సామర్థ్యాలు. విప్రనారాయణుడు వనమాలికాంశజులు. అతనికి ఏ దోషమూ అంటదు. నేను మోక్షం ప్రసాదిస్తాను' అన్నాడు.

"బాగానే ఉంది గాని స్వామికి చేసిన కైంకర్యఫలం ఏదీ?" అని అడిగింది ఇందిర. 'నిజమే! నీ మాట. ఆ విన్నపం పరిశీలించదగ్గదే. నేను తప్పక ప్రసాదిస్తాను' అన్నారు రంగనాథుడు.

ఇది చేయవచ్చు, ఇది చేయరాదు అని ఆలోచించకుండా రంగనాథుడు వటుడయ్యాడు. విభీషణుడు శ్రీరామావతారంలో ప్రసాదించినదీ, శ్రీరంగనాథుని గర్భాలయంలో పూజార్థం పంచపాత్రలలో ఒకటయినదీ అయిన బంగారు గిన్నెను తనచేత పట్టుకొని దేవదేవి వాకిట నిలిచాడు. కవాటం మీటి 'గడియ తీయండి పని ఉందని' కేకవేశాడు.

విటకంటకి చర్రున లేచింది.

'రావద్దని తరిమేస్తే మరల ఎందుకు వచ్చావు? వెంటనే వెళ్ళిపో. కొండ ఎత్తుకోవడం నీకు సాధ్యమా? నీ కుయుక్తులు కట్టిపెట్టు. నీవు వెళ్ళకపోతే నీకు నాచేతి రోకలిపెట్టులు తప్పవు' అని రుసరుసలాడింది.

వటు వేషధారి 'అమ్మా! విప్రనారాయణుడు మీకు ఈ కనకపాత్ర ఇమ్మని చెప్పి పంపించాడు. చూడండి ఈ హేమపాత్రం. నేనెవరని సందేహిస్తున్నారా? కాంతోపయంతుణ్ణి. విప్రనారాయణుల శిష్యుణ్ణి. తలుపు తెరవండి'. అని గట్టిగా చెప్పాడు.

'బంగారు' అనే మాట వినగానే దేవదేవి వచ్చింది. తల్లి వద్దన్నా గడియ తీసింది. సూర్యబింబంలా కనిపించే వటువుచేతిలో బంగారుపాత్రను చూచింది. లోనికి రమ్మంది. ఇంటిలో కూర్చోపెట్టింది. మర్యాదలు చేయసాగింది.

ఈ దృశ్యమంతా చూస్తున్న దేవదేవి సోదరి విటకంటకి 'దేవ విప్రపుంగవా! పని గట్టుకొని విప్రనారాయణులు బంగారుపాత్ర నీచేత ఇప్పుడే పంపడమెందుకు? ఇంతకాలం



12

# పరమయోగివిలాసం

– ఆచార్య కె. సర్వోత్తమరావు

మాతోనే విప్రనారాయణులు ఉండలేదా? మాలో అతడు ఒకడే. వేరొకడు కాదు. పరిహాసంగా మాటలాడిన మాటలను మనసులో పట్టించుకోకూడదు. తల్లిబిడ్డలకైనా వాదులాట సహజమే. అతని మనసు తెలుసుకోలేక ఏవో పరిహాస ప్రసంగాలాడితే నొచ్చుకొని ఒక్కమాటైనా చెప్పకుండా తనదారిన పోయాడు. ఇకపైన ఆలాంటి మాటలనడం మానేస్తాం. ఇంత తొందరగా తన పంతం చెల్లించు కొంటాడని మాకు తెలియదు. అంతేకాదు 'అతనితోనే నాలోక' మంటుంది. అతడు వెళ్ళిపోయాక దిగులుతో నేలమీద పడుకొంటు న్నది. కంట తడిపెడుతూనే ఉంది. లెమ్మంటే లేవడం లేదు. నీ మాట వినగానే వాకిటికి వచ్చింది. బంగారమనగానే వాకిటికి వచ్చిందనుకోవద్దు. కడుపులో చేయిపెట్టి కలచినట్టుగా కలతపడి పోతూ ఉంది. అతికష్టం మీద ధైర్యం తెచ్చుకొంది' అన్నది.

మరలా నంగనాచిలా 'నీవిచ్చిన గిన్నె అందుకొంటే చూచే వారు మాటపైకి అనకున్నా నేను బాధపెట్టాను కదా అని అనుకోరా. ఒకవేళ గిన్నె వద్దనుకొంటే మంచిది కాదు కదా. మనసుంటే చాలు. నాబిడ్డ ప్రాణం దక్కితేచాలు. మీ అయ్యను రమ్మను. రానంటే మొక్కి వెంటబెట్టుకొనిరా' అంది.

వటువు మనసారా నవ్వుకొన్నాడు.

తిన్నెమీద నిద్రపోయే విప్రనారాయణుని దగ్గరికి వచ్చాడు. 'ఎవరు నీవు? ఎవరు నీవు?' అని ప్రశ్నించాడు. 'నేను విప్రనారాయణుణ్ణి' అన్నాడు. 'ఇక్కడెందుకు పడుకొని ఉన్నావ'ని ప్రశ్నించాడు.

'దేవదేవి, దేవదేవి తల్లి నీ కోసం ఊరంతా వెదికారు. కనబడకపోతే కనుక్కొని రమ్మని నన్ను పంపారు. రా! వెళదాం' అన్నాడు. ఆ మాటలు చెవుల్లో అమృతం పోసినట్టయింది.

'తండ్రీ! నీవెవరవో? నా పాలిటి దైవానివి. రంగనాథు డివా? కాకుంటే నాపై ఇతరులకు కరుణ ఎందుకుంటుంది?' అని దేవదేవి ఇంటికి అడుగులు వేశాడు చరచరా.

దేవదేవి విప్రనారాయణునికి స్వాగతం పలికింది. బంగారు గద్దియమీద కూర్చోబెట్టింది. పాదాలు కడిగింది.

చంద్రికలాంటి గుడ్డతో తడితుడిచింది. సకల మర్యాదలు చేసింది. విప్రనారాయణుని సంతృప్తి పరచింది.

సూర్యోదయమైంది. శ్రీరంగనిలాయర్చకులు సంప్ర దాయానుసారం ఆలయం ప్రవేశించి ఆ సమయంలో చేసే పూజా విధానాలు పూర్తి చేశారు. గర్భాలయంలో పంచబేరాలకు ప్రణుతి చేశారు. పంచపాత్రలలో నడుమ ఉండే పెద్ద గిన్నె లేకపోవడాన్ని గుర్తించారు. అర్చకులు వణకిపోయారు. పరిచారజనాన్ని అడి గారు. లోపల వెలుపల తిరిగేవారిని ప్రశ్నించారు. చివరకు నంబులతో 'ఆలయ యతీశ్వరుల దగ్గరికి వెళ్ళి' ఫిర్యాదుచేశారు.

ఆ యతీశ్వరులు సభ్యుల్ని ఇతరుల్ని స్థానికాధికారుల్ని ఒకచోట చేర్చి 'మతిమంతులార! రంగనాథుని సొమ్ము కనబడడం లేదు. నంబులకు తెలియకుండా చౌర్యం ఎలా జరిగి ఉంటుంది? ఇలా ఎన్ని పోయాయో' అని గద్దించారు.

నంబులు ఏడుపుమొగం పెట్టారు. నంబుల్ని బంధిం చారు. అపుడొక ఏకాంగి నంబుల్ని శిక్షించడానికి కత్తి చేబడితే ఇతరులు అడ్డుకొన్నారు. అపుడు ఆలయాధికారి 'ఆగండి. వీరు అచ్చులో ముచ్చులో తేల్చేస్తా' అన్నాడు.

విటకంకటి ఇంటిలో 'చంచలవాణి' అనే పరిచారిక. పేరుకు తగ్గట్టే మాటల్లో నిలకడలేని వ్యక్తి. ఆవిడ ఒక రోజు విట కంకటి అనుమతితో శ్రీరంగనగరానికి వచ్చింది. శ్రీరంగాలయం లోపల అడుగులు వేసింది. వేయికాళ్ళమండపం దగ్గర ఆగింది.

అక్కడే ఒక దృశ్యం చూచింది.

మండుటెండల్లో వీపులమీద చాపరాలతో మెడలో పొగడ దండలతోడి వారిని చూచి అదిరిపడింది. 'ఎందుకు వీరికీ శిక్ష?, అని ప్రశ్నించింది. 'గిన్నె కోసం ఈ పాటు. ఆ గిన్నె కన బడితే ఈ పాటు లేదు' అన్నారు సేవకులు. 'అది దొడ్డసొమ్ము. ఇదంతా నీకెందుకు? వెళ్ళు' అన్నారు. 'ఆ సొమ్ము గురించి చెబితే ఆర్చేదానివా? తీర్చేదానివా?' అని ప్రశ్నించారు, అప్పుడా చంచల వాణి –

'ఆ పోయిన గిన్నె మా అక్క దగ్గరున్న బంగారుగిన్నె కన్న గొప్పదా' అన్నది. ఈ మాటలతో వారిలో అనుమానం హెచ్చింది.

'ఏం వాగుతున్నావు? నీ ఒంటి మీదున్న సొమ్మంతా లెక్కగడితే రూకెత్తు బంగారం లేదు. నీ అక్కకు అంత సారా. పోవె అబద్ధాలాడకు మీ దగ్గరున్న గిన్నె ఏలాంటిది? ఎవరు తెచ్చి ఇచ్చారు?' మా అక్క తక్కువది అని అనుకొన్నారా? ఇచ్చవచ్చిన వారు ఇంటికే తెచ్చి ఇచ్చారు. వారెవరయితేనేం? మా అక్క అంటే మీకు అలుసు కాబోలు' అన్నారు.

ఈ మాటలన్నీ విన్నవారు అనుమానంతో ఆమెను కట్టిపడ వేసి అధికారి దగ్గరికి తీసికెళ్ళారు.

"చంచలవాణివా నీవు. ఇక్కడున్న గిన్నెలు మా అక్కదగ్గ రున్న గిన్నెలకు ఏమాత్రం సరిపోవు. తూగవు అంటున్నావా? ఆ గిన్నెల సంగతేమిటో చెప్పు. భయపడకుండా చెప్పు. లేకపోతే కఠిన శిక్ష తప్పదు."

చంచలవాణి భయపడింది. వడవడ వణకసాగింది. నోట మాట పెగల్లేదు. 'అయ్యా! నాకేమీ తెలియదు. నిన్నరాత్రి

నేరేడు పండులాంటి ఒక బ్రాహ్మణకుమారుడు మా అక్క ఇంటికి వచ్చాడు. మా అక్కచేతికి ఒక బంగారుగిన్నె అందించాడు. తరువాత తన దారి పోయాడు. దాపెట్టడానికిచ్చాడో ఆమెకే ఇచ్చాడో తెలియదు' అంటూ కన్నీళ్ళు పెట్టుకొంది. అధికారులు 'ఆచూకీ' దొరికినందుకు సంతోషించారు.

తన కింది అధికారులతో 'వినండి. దేవదేవి ఇంటికి వెళ్ళండి. శ్రీరంగనాథుని గుడి సొమ్మయిన గిన్నె గురించి వాకబు చేయండి. తెచ్చి ఇచ్చినవాని ఆరాతీయండి. అంతేకాదు దేవదేవిని, తల్లిని బంధించి నా ఎదురుగా నిలబెట్టండి.' అంటూ హుకుం జారీచేశారు.

భటులు వాయువేగంతో పరుగెత్తారు.

దేవదేవి ఇల్లు చుట్టుముట్టారు. కొందరు లోపలికి ప్రవేశించారు. ఒక హంసతూలికాతల్పంపై పడుకొన్న విప్రనారాయణుల్ని, అతని పాదాలను ఒత్తుతున్న దేవదేవిని చూచారు..

ఒక్కసారిగా దూకినట్లుగా దూకి ఆమె జడపట్టి ఈడ్చారు. దగ్గరున్న బంగారుగిన్నెను తీసుకొన్నారు. ఉయ్యాలపై ఉన్న విప్రనారాయణుల భుజాలను గట్టిగా పట్టుకొని అతడు కట్టుకొన్న పంచెతోనే కట్టిపడేశారు.

'పేటలో నీకు సాటిరాదగ్గ సానులు లేరంటారు. మరి నీకేమి కొరత. శ్రీరంగప్పగిన్నె నీకు కావలసివచ్చిందా? ఎందరో రాచకొడుకుల సొమ్మును కానుకలుగా దోచుకొన్నావు. చాలక రంగనాథుని సొమ్ముకే ఎసరు పెట్టాలను కొన్నావే?' అంటూ ఆమెను పట్టి బిగగట్టారు. విప్రనారాయణుల వైపు చూచి–

'ఓరీ! మంచివాడిగా కనబడుతున్నావు. ఈ బంగారు గిన్నెను ఎలా తస్కరించావు? నీకేమయినా మాయా మంత్రాలు తెలుసా? బ్రహ్మమహేశ్వరులు కూడా అడుగుపెట్టడానికి వీల్లేని శ్రీరంగధామంలోనికి ఎలా వెళ్ళగలిగావు? ఓరీ దొంగ! ఒంటి నిండా నామాలే. నామాలు కాదురా కన్నం కత్తులు' అని దుర్భాషలతో దూషించారు.

విప్రనారాయణుడు బాధపడుతూ 'రంగ! శ్రీరంగ! స్వామి, ఏమిటి ఇదంతా నీ లీలలే?' అని స్వామిని స్మరించాడు. తదనంతరం వారితో 'నీతికోవిదులార! వినండి. రంగనాథుని సొమ్మును వంచనతో తెచ్చిన వాణ్ణికాను. దేవదేవికి ఇచ్చిన వాణ్ణీకాను. నేనే పాపం ఎరగను. నన్ను వదలిపెట్టండి' అంటుంటే వేశ్యామాత ఒక్కసారిగా ఉరికింది.

'ఓరీ! అర్ధరాత్రివేళ ఈ గిన్నెను నీవు నీ శిష్యునిద్వారా పంపలేదా? అబద్ధాలాడతావేమిరా?' అని జాడించింది. అనుకోని సంఘటనలకు నివ్వెరబోయి కూతురిని కావలించుకొని –

## విజ్ఞప్తి

**సప్తగిరి చందాదారులు చందా నమోదు పత్రంలో వారి చిరునామాలో ఫోన్/ సెల్‌ఫోన్, పిన్‌కోడ్ నెంబర్లు స్పష్టంగా తెలుపవలెను.**

'దేవదేవి! చూశావా? వీణ్ణి చూడగానే దొంగలాగున్నాడని ఆనాడే చెప్పాను. అయినా నామాట వినలేదు. వీణ్ణి నమ్మవచ్చునా? నేపాళబంగాళపాంచాల చోళాది రాజసుతుల సత్కారాలందిన నీకు ఈ 'బంధం' వేయడం నేనెలా చూస్తాను. నిన్ను పట్టుకుని రాజ సభల్లోకి తీసికెడుతూ ఉంటే నా గుండె చెరువై పోతుందమ్మా' అని ఏడుస్తుంటే–

'చాల్లే, రావే! రాత్రివేళ దొంగల్ని పంపి ఆలయంలో గిన్నె దొంగలించి దాచుకొన్నప్పుడు లేదా ఈ ఆలోచన? నగరి వారు ఆరా తీసి శిక్షకు సిద్ధపరిస్తే ఏడ్వడమా?' అని అదలించారు.

చివరకు మౌనివరుని, దేవదేవిని తమ వెంట లాక్కొని వెళ్ళారు. దారిలో ఎందరో వారిని చూచి తలొక రకంగా తర్కించుకొన్నారు.

'అమాయకుడిలా ఉన్నాడే? వీడేనా దొంగ? యోగిలా కనిపిస్తున్నాడే. నవమన్మథునిలాగా ఉన్నాడే. అయినా ఆ దేవదేవి ఎండ కన్నెరుగనిదానిలా ఉందే. వీరు దొంగలించారా! నమ్మడానికి వీల్లేకుండా వుంది' అని అనుకున్నారు కొందరు.

'చూస్తేనే దిష్టితగిలేలా ఉన్నారు. వీరిని అనవసరంగా పట్టుకొని వెళుతున్నారేమో? వీరు దొంగలు కారు. కావడానికి వీల్లేదు. ప్రతిన చేయవచ్చు' అని కొందరు.

రక్షకభటులు చివరకు వారిని అధికారిముందు నిలబెట్టారు. అధికారికి పట్టరాని సంతోషం గిన్నె దొరికిందని. అయినా ఒక సంశయం.

వీరిని శిక్షించాలా? వద్దా? ఈ అధికారం తనకుందా? లేదా? అని.

ఎందుకయినా మంచిదని చోళరాజుదగ్గరికి ఈ ఫిర్యాదు తీసుకెళ్ళారు. రాజు చాలా ఆశ్చర్యపడ్డాడు.

వీరిని శిక్షించడానికిముందు తగవు పూర్వాపరాలు క్షుణ్ణంగా తెలుసుకోవాలనుకొన్నాడు. ప్రతి ఒక్కరిని ప్రశ్నించాడు.

దేవదేవి తన ప్రతిన మొదలుకొని సర్వం చెప్పింది. అయినా మునియోగి దొంగలించాడో దొంగలించలేదో తనకు తెలియదని చెప్పింది.

మునియోగి తన్ను దేవదేవి ఆదరించడం, చివరకు వెడలగొట్టించడం, ఆ తరువాత మర్యాదలు చేయడం లాంటివి చెప్పాడు. తాను దొంగలించలేదు. తాను ఎక్కడా కదలలేదు. ఒక శిష్యునిద్వారా పంపనూ లేదని విశదం చేశాడు.

ఈ మాట వినగానే దేవదేవి విప్రనారాయణులు అబద్ధ మాడుతున్నాడని వాదించడం మొదలెట్టింది.

వీరిద్దరు కీచులాడుకొంటూవుంటే రాజు పండితులతో సహచరులతో "దొంగతనం అసలు జరగలేదు. వచ్చిపోయేవారు ఏ దిచ్చినా తీసుకోవడం దాచడం గణికలకు అలవాటే. ఒక బ్రహ్మ చారి బంగారుగిన్నె ఇచ్చాడంటున్నారు మరొకరు తెలియదంటు న్నారు.

తానే దొంగలించి వటువుతో పంపించి తాను దొంగ లించలేదనడంలో ఏదో తిరకాసు ఉంది. తానే ఇచ్చానంటే తనపై నింద వస్తుందని విప్రనారాయణుడు అనుకొని ఉండవచ్చు. అయినా అతడే దొంగ" అని రాజు నిశ్చయించి దేవదేవిని విడిచి పుచ్చాడు.

దేవదేవి సంతోషించింది. శిక్ష తప్పింది కదా అని సంబరపడింది. రాజు వెంటనే గిన్నెను శ్రీరంగనాథాలయం చేర్పిం చాడు. తదనంతరం సభాసదులను చూచి–

'ఈ చోరునికి శిక్ష నిర్ణయించండి' అని ఆదేశించాడు.

వారు మీనమేషాలు లెక్కపెడుతుంటే–

రంగనాథుడు గరుడవాహనం మీద ప్రత్యక్షమయ్యాడు.

చోళరాజును చూచి 'ఓరీ! ఏమి న్యాయం చేశావు. ఇది నీకు ఉచితమా? ఇదంతా నా లీల. నేనే వటువు రూపంలో గిన్నెను ఇచ్చినవాణ్ణి. విప్రనారాయణుడు నా బిడ్డ. నా ధనం నా సర్వస్వం. నా బిడ్డడే కదా. అయినా ఒక గణికకు ఇచ్చిన సొమ్మును మరల పరిగ్రహిస్తావా? వారికిచ్చిన సొమ్ము వారికే' అన్నాడు.

రాజు భయభ్రాంతుడయ్యాడు.

తనవారితో తానూ సాష్టాంగనమస్కారం చేశాడు.

'స్వామీ! తెలియక తప్పు చేశాను. క్షమించు. శ్రీరంగ నాథ! నన్ను రక్షించు. కరుణాసముద్రుడివి' అన్నాడు.

విప్రనారాయణునికేసి చూచి–

'శ్రీరంగేశుని నిజకుమారుడివి. దేవరపుత్రుడివి' అంటూ అతనిని సింహాసనంపై కూర్చోబెట్టాడు. పాదపద్మాలను కడిగాడు. పట్టమహిషులతో తాను సేవలు చేయసాగాడు. వివిధోపచారాలు చేశాడు. ఆ యోగిపుంగవుని పల్లకిలో కూర్చోబెట్టి తానే పుర వీథులలో మోశాడు.

తదనంతరం విప్రనారాయణులు శ్రీరంగాలయం చేరు కొని "స్వామీ! వాసుదేవా! వాత్సల్య జలధి. నీ మహిమలు వర్ణింప నా తరమా?" అని సాగిలబడ్డాడు. అపుడు స్వామి 'బిడ్డా! నీ సుమకైంకర్యానికి పరవశుణ్ణయ్యాను. మెచ్చుకొంటున్నా. ఏమైనా వరములడుగు ప్రసాదిస్తాను' అన్నాడు.

"స్వామీ! నాకేమీ వద్దు. నీ భక్తజనుల పాదపద్మసేవా రాధన కలిగించు. ఇదే నా వరం" అంటే 'తథాస్తు!' అని స్వామి అంతర్ధానం అయ్యాడు. అంతేకాదు. నా గోపకాంతావిహారానికి ఏ ఫలమబ్బుతుందో అలాగే ఈ భూప్రపంచంలో ఈ మహాపురుషుని చరిత్ర ఒకసారైనా తలచేవారికి సకలసౌభాగ్యాలు సమకూరతా యని ఆనతిచ్చాడు.

ఆ కారణంగా విప్రనారాయణులకు **'భక్తాంఘ్రిరేణువు'** నామం సార్థకమయింది.

ఆనాటినుండి విప్రనారాయణులు పుష్పకైంకర్యం చేస్తూ పరమవిరక్తుడై పద్మనాభకీర్తన ఒకటే పరమార్థంగా గడపసాగాడు.

తాను వనమాలిక అంశంవల్ల పుట్టినవాడు కావడంవల్ల ఆ వనమాలికి 'శ్రీమాల' అనే పేర ఒకటి, 'ప్రాబోధకి' అనే మరో ప్రబంధాన్ని రచించి అర్పించాడు.

దేవదేవి కూడా 'ఆహా! ఏమి నా భాగ్యం. విప్రనారా యణుని రాకవల్ల పావనం. ఆ భక్తజన సంరక్షణార్థం రంగనాథుడే వటురూపంలో రావడం, తన ఇంటి పరిసరాలకు దయచేయడం మహద్భాగ్యం. శ్రీరంగనాథుని ఆలయంలోని బంగారుగిన్నె తన ఇంటికి చేరడం సుకృతం. అయినా నేను చేయవలసింది ఒకటి ఉంది' అంటూ తాను సంపాదించిన ద్రవ్యమంతా ఆ బంగారు గిన్నెలో పెట్టి శ్రీరంగనాథునికి సమర్పించింది. అప్పటినుండి శ్రీరంగనాథస్వామిచింతతో కాలం గడిపింది.

'ఈ కథను ఎవరైనా వినినా, వ్రాసినా, చదివినా, చెప్పినా వారికి వైష్ణవుల సత్కృప, హరికృపామృతం తథ్యం.' అని ఫల శ్రుతిలో చతుర్థాశ్వాసాన్ని తిరువెంగళనాథులు ముగించారు.

విప్రనారాయణునికి నవమయోగి, విప్రయోగి, నారా యణ యోగి, మండంగుడి ముని, జ్యేష్ఠావతారముని, మాలాకర యోగి, రంగభక్తముని, రంగముని, శ్రీరంగముని, శ్రీరంగరాజ తనయ యోగి, వనమాలాంశ యోగి, ఆరామయోగి, ఆరోపిత దోషయోగి, తొండరడిప్పొడి ఆళ్వార్, భక్తపద్రేణుమాశ్రయ, అని నామాంతరాలు.

కోదండే జ్యేష్ఠ నక్షత్రే మండంగుడి పురోద్భవమ్ ।
చోళోర్వ్యాం వనమాలాంశం భక్తపద్రేణుమాశ్రయే ॥

*(ఇంకా ఉంది)*

భగవద్రామానుజులకు తిరుపతి తిరుమలకు అనుబంధముండడానికి, పెరగడానికి చాలా కారణాలున్నాయి.

**మొదటిది** – విశిష్టాద్వైతానికి 'మూలకందమయిన దివ్య ప్రబంధం'లో ఆళ్వారుల వేంకటేశ్వరాత్మక పాశురాలు రెండు వందల ఏబదికంటె పెచ్చు ఉండడం.

**రెండవది** – రామానుజులు తిరుమల రాకకు మునుపే రామా నుజుల మేనమామ 'తిరుమల నంబి' తిరుమలలో స్వామి వారికి తన పరిధిలో తోయ, పుష్పకైంకర్యాదులు చేస్తూ అక్కడే స్థిర నివాసం చేయడం.

**మూడవది** – తన ఆనతితో 'అనంతాళ్వాన్' భార్యతో తిరుమలకు చేరి పూల తోట నిర్మాణానికి చెఱువు త్రవ్వి తోటను పెంచి, పూచిన పుష్పాలను శ్రీవారికి అర్పిస్తూ తిరుమలలోనే వసిం చడం.

**నాల్గవది** – తిరుమల శ్రీవైష్ణవక్షేత్రం కనుక వైష్ణవులైనవారు తమ జీవితకాలంలో ఒకసారైనా 'తిరువేంగడముడైయాన్'ను దర్శించాలని ఉబలాటపడడమూ కారణం కావచ్చు.

**ఐదవది** – శ్రీరంగంలాంటి ఆలయాలలో పూజాదికాలు సక్రమంగా నిర్వహించడానికి నియమావళిని ఏర్పరచిన రామానుజులు కర్ణాకర్ణిగ తిరుమలమీద శ్రీవారి సేవలు అనేక కారణాలవలన సక్రమంగా జరగడం లేదని తెలిసి, తిరుమలనంబి, అనంతాళ్వాన్‌ల ద్వారా రూఢి పరచుకొని వాటిని చక్కదిద్దడానికోసం శ్రీవారి కైంకర్యాలు తన వంతుగా బాగా జరపడానికి ప్రయత్నించాలనుకోవడం.



# తిరుమల - శ్రీరామానుజుల కైంకర్యాలు

- ఆచార్య కోసూరి దామోదరనాయుడు

### తిరుమలలో శ్రీరామానుజుల కైంకర్యాలు

భగవద్రామానుజులవారు తిరుమలలో చేసిన కైంక ర్యాలు అనేకం. వాటిలో ప్రధానమైనవి మూలమూర్తి నిర్ధారణ.

### శ్రీరామానుజుల విగ్రహప్రతిష్ఠలు

యాదవరాజు సభలో 'మూర్తి వివాదం' పరిష్కారం కావడంతో శ్రీరామానుజులు భవిష్యత్తులో ఇలాంటి వాదనలు మొలకెత్తకుండా ఉండడానికి అన్నివిధాల సన్నద్ధులైనారు. ఆలయంలో చాలవరకు వైష్ణవచిహ్నాలే కనబడేలా ఆగమశాస్త్రం ప్రకారం చర్యలు తీసుకొన్నారు.

ఉన్నతమయిన దివ్యవిమానంలో నాలుగుదిక్కులలో వరాహ, నారసింహ, వైకుంఠనాథ, శ్రీవేంకటేశ దేవతామూర్తు లను ప్రతిష్ఠ చేశారు. ఆలాగే మహావిష్ణువు పరివారదేవతలైన గరుడ, అనంత, విష్వక్సేన, జయవిజయులను ఉచితస్థానంలో ప్రతిష్ఠించారు. వీటితోబాటు మరికొన్ని విగ్రహాల ప్రతిష్ఠలకు చర్యలు చేబట్టారు. వాటిలో ప్రధానమైనవి మూడు.

### శ్రీవారి ఆలయంలో యోగనారసింహ విగ్రహప్రతిష్ఠ

శ్రీరామానుజుల కాలంనాటికి తిరుమల ఆలయంలో 'యోగనరసింహాలయం' లేదు. శ్రీవైష్ణవంలో అన్ని అవతారాలకు



ప్రాధాన్యం సమానమైనా, వరాహనారసింహరామకృష్ణాద్యవతారా లకు విశేష ప్రాధాన్యముంది. ప్రత్యేకించి అహోబలం 108 దివ్యతిరుపతులలో ఒకటి కావడం, నారసింహుని 32 రకాల మూర్తులలో 'యోగనారసింహమూర్తి' విశిష్టం కావడం. ఉపా సకులకు 'నారసింహమంత్రం' ముఖ్యం కావడంతో రామానుజులు ఆళ్వారుల స్తోత్రాలకు పాత్రుడై స్వామిపుష్కరిణి పశ్చిమంలో పూజాదులకు నోచుకోని 'యోగనారసింహుని' మూడడుగుల ముద్దులమూర్తిని తిరుమల ప్రధాన ఆలయంలో విమాన ప్రదక్షిణ మార్గంలో ఈశాన్య మూలాన పశ్చిమాభిముఖంగా ప్రతిష్ఠచేశారు. తరువాతి కాలంలో ఈ మూర్తికి ముఖమండపం, అంతరాళం చుట్టూ ప్రదక్షిణమార్గాలు ఏర్పడడంతో సర్వజనులకు ఈ ఆలయం సేవ్యమానమైంది.

ఈ స్వామిని తమిళంలో 'అళగియ సింగర్' అని (అందమైన సింహం) వేంకటత్తరి (వేంకటశైలం మీది హరి) అంటూ భక్తులు సేవిస్తారు. ఈ ఆలయం క్రీ.శ. 1330–1360 మధ్య సుప్రతిష్ఠమైందని చారిత్రకుల అభిప్రాయం. క్రీ.శ.1469 లోని కందాడై రామానుజయ్యంగారి శాసనంలో 'యోగనారసింహుల' ప్రస్తావన ఉంది.

రామానుజుల కాలంనాడు లక్ష్మీ విరహితుడైన ఈ స్వామికి ఏలాంటి పూజలు ఏలా జరిగేవో తెలియదుగాని ప్రస్తుతం ప్రతిదినం నిత్యపూజలు లేకున్నా శుక్రవారంనాడు అభిషేక, పూజాదికాలు జరుగుతున్నాయి. ప్రతి సంవత్సరం వైశాఖమాసంలో నృసింహజయంతి ఉత్సవాలు కూడా వైభవంగా నిర్వహిస్తున్నారు.

రామానుజుల కాలంనాటికి ప్రతి వైష్ణవాలయంలో 'దివ్యప్రబంధ పారాయణం' నియతం. ఆ కారణంవల్ల ఈనాడు కూడా యోగనారసింహ ఆలయంలోను 'తిరుప్పల్లాండు' ఆదిగా ప్రబంధపారాయణం జరుగుతున్నది.

### పూలబావిలో 'భూదేవి ప్రతిష్ఠ'

తిరుమల శ్రీవారి ఆలయం అద్దాలమండపానికి ఉత్తరాన ఒక బావి ఉంది. ఆ బావికి నేడేమో 'పూలబావి' అని పేరు. ఆ బావి ఒకప్పుడు భూతీర్థం. ఆ తీర్థం నిక్షిప్తం కాగా అక్కడే రంగదాసు బావి త్రవ్వి దగ్గర తోటనుపెంచి స్వామికి పూలకైంకర్యం చేసేవాడు కావడం వల్ల రంగదాసు బావిగా విఖ్యాతమైంది. అనంతరకాలంలో ఆ రంగదాసుడే తొండమాను చక్రవర్తిగా పుట్టి శిథిలమయిన బావిని పునరుద్ధరించాడు.

స్వామికి తొండమాన్ చక్రవర్తికి గల అనుబంధం ప్రగాఢమైంది. ఎప్పుడనుకొంటే అప్పుడు స్వామివారిని ఆ చక్రవర్తి సేవించేవాడట. ఒకసారి ఆ చక్రవర్తికి విరోధులతో కయ్యం సమకూడింది. చక్రవర్తి పరుగుపరుగున శ్రీనివాసాలయం చేరుకొన్నాడు. అది అభ్యంతరమందిరం. ఆ మందిరంలో స్వామి శ్రీదేవీభూదేవులతో ఉన్నారు. చక్రవర్తి రాకతో శ్రీదేవి స్వామి వక్షఃస్థలంలో దాగింది. భూదేవి తొండమాన్ కట్టించిన బావిలో దాగింది.

రామానుజులు తిరుమల చేరుకొన్నవేళ వరాహపురాణాంతర్గతమైన ఈ సన్నివేశాన్ని గుర్తుకు తెచ్చుకొన్నారు. ఆ ప్రశస్తస్థలాన్ని చూచి తన్మయులయ్యారు. అక్కడే భూదేవిని ఈ 'తీర్థాధిపత్యంబందిన' అర్చా రూపంలో ప్రతిష్ఠ చేయించి దేవికి సమీపంలో 'తీర్థనయినార్' అనే శ్రీనివాసుని కూడా ప్రతిష్ఠించి ఆ బావిలో వారి ఇరువురిని జంటగా విజయం చేయించి వారికి ప్రతిదినం ప్రసాదం ఆరగింపు చేసేలా కట్టడి చేశారు. స్వామికి అర్పించే పూలను ఆ బావిలో వేసే విధంగా నిర్ణయించారు. ఈ అంశాలన్నీ "తిరుమలై ఒళుగు లోనూ, వేంకటాచల ఇతిహాసమాల"లోనూ వర్ణితం.

## పంచలోహ 'సీతాదేవి' విగ్రహం

తిరుమలలో శ్రీవారి ఆలయం బంగారువాకిలి దాటగానే కుడివైపున 'రామర్‌మేడై' ఉంది. ఆ మేడైలో సుగ్రీవ, అంగద, ఆంజనేయ విగ్రహాలు ఉండేవి. ప్రస్తుతం రామర్ మేడైలోని విగ్రహాలు అంకురార్పణ మండపం లోనికి మార్చబడ్డాయి. అక్కడే భక్తాదులకు 'తీర్థశఠారి' ఇవ్వడం నేటివిధానం. ఈ విగ్రహాలకు సంబంధించి ఒక ఐతిహ్యం "శ్రీవేంకటాచలేతిహాసమాల"లో ఐదవస్తబకంలో ఉంది.

విశ్వంభరుడనేవాడు మహాముని. అతడు 'కురువిత్తుత్తై' అనే నగర వాసి. ఆ నగరం సమీపంలోనే 'కృతమాల' నది ప్రవహిస్తుంది. అతడు రామాయణకథాశ్రవణకుతూహలపరుడు.

ఒక రోజు వసిష్ఠరామాయణంలో 'శ్రీరాములవారు విభీషణునికి అభయ ప్రదానం చేస్తాను. వానరోత్తమా! విభీషణుని తోడ్కొని రమ్ము' అనే సన్నివేశాన్ని చదివి విశ్వంభరుడు పులకించాడు. ఆ సన్నివేశ విశేషంతో కూడిన రాముని సాక్షాత్కరించుకోవాలని తపస్సు చేశాడు. శ్రీరాముడు ఆలాగే కలలో అతనికి సాక్షాత్కరించాడు. విశ్వంభరుడు తాను దర్శించిన రూపంలో 'అర్చారూపాలను' తయారుచేశాడు. పూజించడం మొదలెట్టాడు. అనుకోనిరీతిలో 'కలవింకావతార' నగరంలో మహాకలహం రేగింది. అపుడు స్వామి ఒక భక్తుని మీద ఆవహించి విశ్వంభరునితో తన్ను వేంకటాద్రికి చేర్చుమని ఆదేశించాడట. అప్పుడే విశ్వంభరుడు ఆ విగ్రహాలతో వేంకటాద్రికి కదిలాడు.

వేంకటాద్రిలో తిరుమలనంబి, రామానుజులకు రామాయణ రహస్యాలు వివరిస్తున్నచోటుకి విశ్వంభరుడు చేరుకొన్నాడు. సరిగ్గా అదే సందర్భంలో 'విభీషణ శరణాగతి' ఘట్టం చర్చింపబడుతుంటే వారున్ను సంతోషించారు. శ్రీజానకీదేవి విశ్వంభరుడు తెచ్చి ఇచ్చిన విగ్రహాలలో లేదు. ఉండడానికి కూడా వీలులేదు. అంచేత రామానుజులు ఈ కొరతను గుర్తించి వెంటనే 'సీతావిగ్రహం' తయారుచేయించారు. అంతేకాదు సీతారాముల కల్యాణాన్ని కూడా వైఖానసాగమోక్తంగా వైభవంగా జరిపారు.

## ఆదివరాహమూర్తి ప్రాధాన్యం

తిరుమలకు ఆదివరాహక్షేత్రమని నామాంతరం. ఇందుకు ప్రబల నిదర్శనం పుష్కరిణి చెంత 'భూవరాహస్వామి ఆలయం'. ఆ స్వామియే శ్రీవేంకటేశ్వరుని ఉనికికి స్థలమిచ్చినవాడు. **"ముందు వచ్చిన చెవులకంటె వెనుక వచ్చిన కొమ్ములకు వాడి"** అన్నట్లు అనేక కారణాలవల్ల వేంకటేశ్వరాలయానికి ప్రసిద్ధి ఏర్పడడంతో క్రమంగా ఆదివరాహమూర్తికి, పూజాదికాలు సన్నగిల్లాయి. ప్రాధాన్యం క్రమంగా తగ్గింది. ఈ అంశాన్ని



గుర్తించినవారు రామానుజులు. బ్రహ్మపురాణం ఎనిమిదవ అధ్యాయంలోని -

'వరాహస్వామి దర్శనము చేసుకోవడానికి ముందు శ్రీనివాసునికి నమస్కరింపరాదు. వరాహస్వామికి పూర్వమే తన దర్శనము చేసికొనిన శ్రీనివాసుడు తృప్తిచెందడు' అనే వాక్యాలనుబట్టి వరాహస్వామి దర్శనజ ప్రాధాన్యం విశదం చేశారు. అంతేగాక తొలిపూజ, తొలి నివేదనాదులే గాకుండా శ్రీవరాహ దేవతావతార దివ్యనక్షత్రభూతమైన తులామాస శ్రవణానక్షత్రం వరాహజయంతినాడు విశేషోత్సవం జరిపించాలని వ్యవస్థ చేశారు.

## నూతనోత్సవాల నిర్వహణ

త్రికరణశుద్ధితో స్వామివారిని విభిన్న సందర్భాలలో రకరకాల కైంకర్యాలతో సేవించిన వారిని స్మరించడం అవసరమని భావించినవారు రామానుజులు. క్రూరమృగాలు సంచరించే ప్రదేశాలలో, సామాన్య జీవనానికి వాతావరణం సహకరించని ప్రదేశాలలో మందీమార్బలం అంతంతే కాగా భీతావహమయిన తిరుమలలో సాహసించి సేవచేసిన వైష్ణవులు తిరుమలనంబి, అనంతాళ్వాన్‌లు. ఒకరిది తోయకైంకర్యం. మరొకరిది పుష్పకైంకర్యం. వీరి సేవలను భావితరం వారు కూడా గుర్తుపెట్టుకొనేలా ఆలయోత్సవాలలో కొత్తగా రెంటిని ప్రవేశపెట్టిన ఘనత రామానుజులదే.

## గరుడోత్సవం రోజు శ్రీవిల్లిపుత్తూరు గోదాదేవి మాలా సమర్పణం

తిరుమలలో శ్రీవారికి జరిగే మహోత్సవాలలో బ్రహ్మోత్సవం ఒకటి. ఆ బ్రహ్మోత్సవాలలో గరుడోత్సవం చాలా ప్రశస్తి కెక్కింది. ఆనాడు తమిళనాడులోని దివ్యదేశాలలో ఒకటైన శ్రీవిల్లిపుత్తూరు నుండి తీసుకురాబడిన గోదాదేవి మాలను స్వామికి అలంకరించడం నేటికీ సంప్రదాయంగా ఉంది. ఈ సంప్రదాయానికి శ్రీకారంచుట్టినవారు రామానుజాచార్యులే. ఈ మాలాసమర్పణం అన్వర్థమనడానికి బలమైన కారణాలున్నాయి.

మొదటిది ఆండాళమ్మగారు **"వెయ్యదోర్ తళలుమిళ్ శక్కరక్కై వేఙ్గడ వత్కైన్నై విధిక్కిట్రియే"** అని తిరువేంగడ నిలయుడైన స్వామిని నాచియార్‌తిరుమొళిలో స్మరించింది. అదీగాక తిరుమలలో ఇతర వైష్ణవాలయాలలో లాగే ధనుర్మాసంలో రోజుకొక పాశురం వంతున తిరుప్పావై సుప్రభాతానికి బదులుగా పాడబడే సంప్రదాయముంది.

## గోదాకల్యాణం

తిరుపతిలోని ప్రధాన ఆలయాలలో గోవిందరాజస్వామి ఆలయం ఒకటి. ఈ ఆలయంలో గోదాదేవి ఉపాలయ నిర్మాణం రామానుజులకాలంలోనే జరిగిందంటారు. రామానుజులు తిరుమలను, తిరుపతిని సమానంగా భావించారు. తిరుమలేశునికి జరిగే సేవలన్నీ గోవిందరాజుకు జరపాలని కట్టడిచేశారు.

ఆ మార్గంలోనే కనుమనాడు 'చూడికుడుత్తనాచ్చియార్'కు అలంకరించిన పూలమాలను తిరుమలకు తెప్పించి స్వామివారికి అర్పించే కార్యక్రమానికి శ్రీకారం చుట్టారు. ధనుర్మాసంలో రోజుకొక తిరుప్పావై పాశురం చదివి చివర గోదాకల్యాణం జరపడం సంప్రదాయం కనుక ఆ రీతిలోనే తిరుమలలో గోదాకల్యాణానికి అంకురార్పణ చేశారు.

## 'తన్నీరముదు' ఉత్సవ నేపథ్యం

యామునాచార్యులు శ్రీరంగంలో నమ్మాళ్వార్ తిరువాయ్‌మొళి మూడవకాండంలో మూడవ శ్రీముఖసూక్తం అనుసంధానిస్తున్నారు. ఒకసారిగా తిరుమలలో పుష్పం - తీర్థం - ధూపాది కైంకర్యాలు చేసేభాగ్యం నాకు సమకూరుతుందా? అని వాపోయారు. ఆ సమయంలో గోష్ఠిలోని తిరుమలైనంబి యామునుల మనోరథం పూర్తిచేయడానికి తిరుమలకు పయనమయ్యారు. తిరుమంగై ఆళ్వారు పాశురాలను అనుసంధానిస్తూ, పాపవినాశజలం తెస్తూ యథాశక్తి పుష్పకైంకర్యం కూడా చేస్తుండేవారు.

తిరుమలస్వామి తాను పరమప్రీతితో తిరుమలనంబి కైంకర్యం స్వీకరిస్తున్నానని ప్రజలకందరికి తెలియజేయాలని సంకల్పించారు. తాను ఒక 'వ్యాధ రూపం ధరించారు. విల్లు చేతబూనారు. పాపవినాశం నుండి ఒక పావనఘటంలో నీరు తెచ్చుకొనే తిరుమలనంబిని మార్గమధ్యంలో చూచారు. స్వామి ఎదురేగి

'తాతా! నాకు దప్పిక. కాసంత తీర్థం ఇవ్వరాదు' అని బతిమాలాడారు. తిరుమలనంబి 'ఓ బోయవాడా! ఈ తీర్థం నాకోసం కాదు. నీకోసం కాదు. వేంకటనాథుని అభిషేకార్థం. మానవులకు ఇవ్వడం కుదరదు' అంటూ యథావిధిగా తిరుమంగై ఆళ్వార్ తిరుమొళిని అనుసంధానిస్తూ వెళుతున్నారు. వ్యాధుడు తిరుమలనంబి వెనకనే వెళ్ళసాగాడు. ఒక అమ్ముతో అతిలాఘవంగా ఘటం వెనుక భాగాన రంధ్రంపడేలా చేశారు.

సన్నటిధార ప్రవిస్తుంటే ఆ నీరంతా తాగేశారు. పాశురాల అనుసంధానిస్తూ వెళుతున్న తిరుమలనంబికి ఇవేవీ తెలియవు. కొంచెం దూరం పోయేసరికి 'ఘటం' తేలికకావడం గమనించి వెనక్కితిరిగి నీళ్ళు తావుతున్న బోయవానిని చూచారు.

'బోయవాడా! ఎంత పని చేశావ్? స్వామి కోసం తీసుకెళుతున్న తీర్థం పూర్తిగా చౌర్యంతో తాగేశావా?' అని కటువుగా కసిరారు.

'తాతా! విచారించకు. ఇక్కడే మీరున్నచోటనే ఒక దివ్య తీర్థాన్ని చూపిస్తాను. ఆ తీర్థజలం తీసుకొని వెళ్ళండి' అంటూ ఆకాశగంగాతీర్థం వైపు దారి తీయించాడు. అక్కడ తీర్థం కనబడలేదు. తిరుమలనంబి బాధపడుతుంటే బోయవాడు తన బాణంతో కొండ కొమ్ము కొట్టాడు. బాణం లాగాడు. అంతే జలధార ప్రవించింది.

'తాతా! ఇదే ఆకాశగంగానది. భగవంతునికి ప్రియాతి ప్రియమైనది. ఇకపైన ఇక్కడి తీర్థాన్నే మీరు తీసుకువెళ్ళవచ్చు.' అని చెప్పి అదృశ్యమయ్యాడు.

తిరుమలనంబి ఆశ్చర్యపరవశులయ్యారు.

'ఆహా! భగవంతుని లీలావినోదాలు అనంతం' అంటూ గుడి చేరుకొన్నారు. పూర్ణకుంభం అక్కడ ఉంచారు.

'తిరుమలనంబి!' నీవు సుదూరం నుండి తెచ్చే జలాన్ని దారి మధ్యలోనే తాగడంతో దప్పిక తీరింద'ని తెలియజేశారు స్వామి. తిరుమల నంబికి తన్ను పరీక్షించినవారు 'శ్రీవారే' అని అవగతమైంది.

తిరుమలనంబి యథాప్రకారం అప్పటినుండి ఆకాశ గంగాతీర్థం తెచ్చేవారు. ఈ కైంకర్యం ఈనాటికి తిరుమలనంబి వంశస్థులచే జరుపబడుతున్నది. భగవంతుడు మానవరూపాన తిరుమలనంబిని 'తాతా' అని పిలవడం వల్ల ఆతనికి 'శ్రీశైలనాథ తాతగురుడు' అనే పేరు ప్రసిద్ధమయ్యింది. సంస్కృతంలో 'తాత' తండ్రిని సూచించే శబ్దం.

తిరుమలనంబి దివ్యావతార నక్షత్రం మేషమాసంలోని స్వాతి. తిరుమలనంబి కాలాంతరంలో పరమపదం చేరుకోగా ఆ మహానుభావుల ఈ పుణ్యకైంకర్యం యావత్ప్రజానీకానికి తెలియజేయడానికోసం రామానుజులు అధ్యయన ఉత్సవం ముగిసే సమయాన 'శీతల తీర్థ అమృత అభిగమ యాత్రోత్సవం' పేరుతో ఒక ఉత్సవం ఏర్పాటుచేశారు.

### 'బాగ్ సవారి' ఉత్సవం

తిరుమలలోని తోటలలో 'అనంతాళ్వాన్' తోట ప్రసిద్ధమైనది. ఈ తోటకు స్వామివారు సంవత్సరంలో రెండు మార్లు వేంచేపుచేయడం విశిష్టం. ఈ రకమైన వేంచేపుకు 'అనంతాళ్వాన్' నిష్కల్మషభక్తి, పూలకైంకర్యం ప్రధానమనక తప్పదు. ఈ ఉత్సవాలకు సంబంధించిన నేపథ్యం చాలా చిత్రమైంది.

శ్రీరంగంలో రామానుజులవారు ఒకసారి గోష్ఠిలోని వారిని పరిశీలించి "తిరుమల పుష్పమండపమని ప్రసిద్ధి. ఆ కొండపై పుష్పకైంకర్యం చేయడానికి ఎవరైనా సిద్ధమా?" అని ప్రశ్నించారు. అపుడు ఆ గోష్ఠిలోని అనంతార్యులు ఆచార్యాజ్ఞ శిరసావహించి ఆ కైంకర్యం చేయడానికి సంసిద్ధు లయ్యారు. రామానుజులు పరమసంతోషంతో నీవే 'ఆణ్‌పిళ్ళై' అని ప్రశంసించారు. ఆ కారణాన వారికి 'ఆనందాణ్ పిళ్ళై' అనే బిరుదనామ మేర్పడింది.

ఆచార్యుల అనుమతితో అనంతార్యులు తిరుమలలో పూలవనం కోసం ఒక ఉద్యానవనాన్ని, ఒక చెరువును, ఒక నడబావిని నిర్మించాలను కొన్నారు. స్వయంగా తటాకం త్రవ్వాలని భావించారు. అతనికి సాయంగా నిండుగర్భిణి అయిన తన భార్య సహకరించేది. అనంతాళ్వాన్ గునపంతో తవ్వేవారు. భార్య తవ్వినమట్టిని తట్టలో వేయించుకొని దూరాన పారవేసేది. ఈ వృద్ధ దంపతుల శ్రమను స్వామి చూడలేకపోయాడు. తానే బాలకుడయ్యాడు. మీరిద్దరు విశ్రాంతి తీసుకోండి. క్షణంలో ఈ పని చేస్తానన్నాడు. అనంతాళ్వాన్ "నేనే స్వయంగా ఈ పని పూర్తిచేయదలచుకొన్నాను. నీవు అడ్డు తగలవద్దు." అని మందలించారు. అడ్డుపడితే గునపంతో కొడతానని కూడా చెప్పారు.

ఆ బాలుడు సరాసరి అనంతాళ్వాన్ భార్యదగ్గరికి వెళ్ళి మంచిమాటలతో వంచించి ఆమెచేతి నుండి మట్టితట్టను తీసుకొని సహాయపడసాగారు. ఈ సంగతి తెలిసి అనంతాళ్వాన్ వారించి తరిమారు. ఆ బాలుడు చెట్టెక్కి నాడు. 'దిగిరా! దిగిరా! నీ పనిపడతా' అని కేకలు వేయసాగారు అనంతాళ్వాన్. 'అయ్యా! మీకు నా ఉంగరం ఇస్తా. పీతాంబరం కూడా ఇస్తా. నన్ను వదలిపెట్టమన్నాడు బాలుడు. అనంతార్యుడు ఆలోచించాడు. దిగివచ్చే వేళ బాలుణ్ణి పట్టుకోవచ్చని సరేనన్నారు. ఆ వటువు గబాలున దిగి పరుగెత్తడం మొదలెట్టాడు. అనంతాళ్వాన్ పరుగెత్తలేక కోపంతో గునపం విసిరాడు. అది బాలుని

చుబుకంపై తగిలింది. గాయం కారణంగా రక్తం స్రవించింది. అయినా బాలుడు పరుగెత్తుతూ ఆలయంలోకి జొరబడి తలుపులు మూసు కొన్నాడు. సాయంత్రం అర్చకులు వచ్చి బాలకుని ప్రార్థించి తలుపులు తెరిపించారు. బాలకుడు కనబడలేదు. ఈ లీల భగవంతునిదే అని అనంతాళ్వాన్ గ్రహించి క్షమాభిక్ష అర్థించారు.

అనంతాళ్వాన్ కైంకర్యంలోని భావశుద్ధిని ప్రజలంతా తెలుసుకోవాలని స్వామి భావించారు. కన్యామాసంలో బ్రహ్మో త్సవ సందర్భంలో ఏడవ రోజు రాత్రివేళ తానూ, అలమేల్మంగ రాజకుమార, రాజకుమారి వేషాలతో పూలతోటకు విజయం చేశారు. పూలు కోసుకొని పోతుంటే అనంతాళ్వాన్ వారిని పట్టు కోవడానికి ప్రయత్నించారు. ఆ రాకుమారుడు అప్రదక్షిణంగా కోవెలచుట్టి నందనవనం వాకిట కనిపించి అదృశ్యుడయ్యారు. రాకుమారి పరుగెత్తలేకపోయింది. 'నిరపరాధిని' నన్ను వదలిపెట్ట మంది. కాని అనంతాళ్వాన్ అమ్మవారిని సంపంగిచెట్టుకు లతాపాశంతో కట్టి బెదిరించి అక్కడ ఉదయం దాకా నిలబడ్డారు.

ప్రాతఃకాలం పూజార్థం వచ్చిన అర్చకులు స్వామి ఉరః స్థలి 'అమ్మవారు' లేకపోవడం చూచి భయభ్రాంతులయ్యారు. అపుడు స్వామి ఒక పురుషుని ఆవేశించి జరిగిన వృత్తాంతం చెప్పాడు. అర్చకులు తోటకు వెళ్ళి కట్లు విడిపించారు. అమ్మను అనంతాళ్వాన్ స్వామికి అర్పించాడు. ఈ సన్నివేశ సాక్షాత్కారంగా 'బాగ్‌సవారి' ఉత్సవం జరుపబడుతున్నది.

### రామానుజులు చేపట్టిన నిర్మాణాలు

రామానుజులవారిది ప్రధాన దృష్టి అర్చావతారాలకు తగిన విధంగా నిర్మాణాలు, ఉత్సవాదులను తగిన విధంగా మార్పులు చేపట్టడం. ఈ దృష్టితో మాడవీథుల విస్తరణ, జీయర్ మఠనిర్మాణం చేశారు.

### మాడవీథుల విస్తరణ

ఆలయం చుట్టువున్న వీథుల్ని 'మాడ' వీథులంటారు. ఆ వీథులు ప్రధానంగా వాహనాల సేవలకు సంబంధించినవి. అంతేకాదు ఆ వీథులు ఒక వైపే. ఆ వీథుల్లోని గృహస్థులు తమ ఇండ్లముందు మాడలలో (గూళ్ళలో) దీపకైంకర్యాలు చేసే వారు. అందువలన సాయంసమయాన మాడవీథులు ప్రకాశవంతంగా ఉండేవి.

'చెండివాళన్' దేవాలయానికి పడమటిభాగాన ఒక వీథి నిర్మించాడు. కైంకర్యపరులకు వాసం కల్పించాడు. అప్పటికి రాజుల అనుమతి లేకపోవడం వల్ల అంతకంటె విస్తరణకు వీలులేకపోయింది. అంతేగాక దేవాలయ పరిసరం ఎగుడు దిగుడు కావడంవల్ల దివ్యనగర అభివృద్ధికి వీలుకాదని భావిం చడం కూడా కారణం కావచ్చు.

రామానుజులు తిరుమలలో వివిధ వాహన సంచారా నికి నడుము బిగించారు. భక్తాదుల దర్శనానికి అనువుగా ఆనాటి పాలకుల అనుమతితో మాడవీథుల విస్తరణ చేశారు.

### జీయర్ మఠనిర్మాణం

ఆలయంలో జరిగే పూజాదికాల పర్యవేక్షణకు, సలహాలకు 'జియ్యర్' వ్యవస్థ రామానుజుల కాలంనాడు ఏర్పడడంతో 'జీయర్‌ల'కు ఒక ఆవాసం తప్పనిసరి అయింది. హనుమంతుడు 'దాసభక్తికి' లక్ష్యప్రాయుడు కనుక తిరుమల శ్రీవారిసన్నిధిలో 'బేడి ఆంజనేయస్వామి' దగ్గరలో జీయర్ మఠం నిర్మించడం మంచిదని తలపోశారు.

### త్రోవ నారసింహ ఆలయనిర్మాణం

అలిపిరినుండి తిరుమలకు వెళ్ళే కాలిబాటలో ఒక నారసింహ ఆలయమున్నది. అగస్త్యమహాముని భక్తులలో



ఒకడయిన 'సుధ' అనబడే వ్యక్తి మార్కండేయ మహామునితో కలిసి తిరుమలకు వస్తుండగా అతనికి 'నారసింహరూపం' గోచరమయింది. రామానుజులు ఆ చోటేదో తెలుసుకొని అక్కడనే నరసింహస్వామిని ప్రతిష్ఠ చేశారు.

### శ్రీరామానుజుల కట్టడి

రామానుజులు ఆలయవ్యవస్థను సువ్యవస్థితం చేసిన తరువాత చేపట్టిన శ్రీకార్యములెన్నో. మచ్చుకు – బ్రహ్మోత్సవాల నిర్వహణ, ఊర్ధ్వపుండ్ర నిర్ధారణ, సంప్రదాయక నామాలను స్థిరంచేయడం లాంటివి.

### ఊర్ధ్వపుండ్ర వివాద పరిష్కారం

శ్రీవారి అభిషేకసమయంలో ఊర్ధ్వపుండ్రం తీర్చే విధానాన్ని కట్టడి చేయడం. అభిషేక సమయంలో ఊర్ధ్వపుండ్రం పైభాగం మొదట కరిగిపోతుంది. కిందిభాగం మాత్రం అర్ధ చంద్రాకారంగా కనిపిస్తుంది. ఈ కారణం వల్లనే శైవులు ఆ విగ్రహాన్ని కుమారస్వామి మూర్తిగా సమర్థించినారు. కానీ రామానుజులవారు మహావిష్ణువు మోహినీ అవతారంలో తీర్చిదిద్దుకున్న అర్ధచంద్రాకార సౌభాగ్యమని తలపోశారు. లోకంలో అవయవ సౌందర్యంతో పాటు అలంకరణ కూడా శోభావహం కావడంవల్ల మోహినీరూపం దేవదానవుల్ని కూడ మోహపరవశుల్ని చేసింది. ఈ దృష్టితో అభిషేకం స్వీకరించిన తరువాత కర్పూరరేణువుతో దివ్యమైన ఫాలభాగాన రేఖాద్వయ పూర్వకంగా సమర్పించే 'తిరునామం' మూడుదినాలు ధరించే కట్టడిని చేశారు.

### పునః 'సుందరస్వామి' నామ పునరుద్ధరణ

శ్రీవైష్ణవంలో 'ఆళవందార్' అయిన యామునాచార్యుల స్థానం పదిలమైంది. వారొకసారి తిరుమలకు విచ్చేశారు. స్వామికి మంగళశాసనం చేశారు. ఆలయంలో శ్రీదేవిభూదేవి సౌకర్య నిమిత్తం త్రవ్వబడినదని భావింప బడే 'బావిని' చూచారు. 'పాపవినాశనం, ఆకాశగంగనుండి స్వామి అభిషేకార్థం నీరు తేవడానికి వీలులేని వేళ బంగారుబావిగా భావింపబడే ఆ బావిలోని జలాన్ని అభిషేకార్థం వాడుకోవచ్చుని, తిరుమలనంబికి యామునాచార్యులు కట్టడి చేశారు. ఆ బావికి 'సుందరస్వామి' అని పేరు పెట్టారు. కాలక్రమేణ ఆ పేరు మరుగునపడి పోయింది. రామానుజులు యామునులమీద గౌరవంతో భక్తిశ్రద్ధలతో మరల ఆ పేరును ఆ బావికి ధ్రువీకరించారు.

### శ్రీవారి ఆలయపరిసరాలలో వృక్షారాధన

తిరుమల అరణ్యమధ్యంలో స్వామిపుష్కరిణీతీరంలో చింతచెట్టు ఒకటి ఉంది. అది ఆదిశేషుని అవతారం నీడ తిరగని చింతచెట్టుగా ప్రసిద్ధి. ఆ చెట్టులో ఒక కొమ్మ చిగురించడం, మరో కొమ్మ పూలు పూయడం, ఇంకొక కొమ్మలో కాయలు కాయడంలాంటి విచిత్రాకారంగా ఉండేది. రంగదాసు అనే భగవద్భక్తుడు స్వామివారికి ఆలయం కట్టేవేళ ఈ చెట్టును ఏం చేయాలో తోచక ఆలోచనలో పడ్డాడు. మరుసటిరోజు ఆ చెట్టు ఉన్నచోటునుండి కదలి స్వామికి ఈశాన్య భాగంలో సుదూరంగా నిలిచింది. రంగదాసు నివ్వెరపోయాడు. అలాగే చంపక వృక్షం. ఇది తిరుమల ఆలయ వృక్షం. ఇప్పటికీ ఆలయంలో సంపంగి ప్రదక్షిణ మార్గముంది. ఈ రెంటికి ఆరాధ్యస్థానం కల్పించాడు రామానుజులు.

### తిరుమలలో బ్రహ్మోత్సవాలు

రామానుజుల కాలంనాటికి శ్రీవారికి బ్రహ్మోత్సవ కాలంలో ధ్వజారోహణ, అవరోహణాదులు మాత్రమే జరిగేవి. వాహనసేవలన్నీ తిరుచానూరులో 'తిరువిళం కోయిల్' ప్రాంతంలో జరుగుతుండేవి. ఇది సరికాదని బ్రహ్మోత్సవం పూర్తిగా తిరుమలలోనే జరపడం భావ్యమని భావించి తనకాలం నాడే తిరుమలలో ఉత్సవాలు జరపడం విశేషం. అప్పటికే మాఢవీథుల విస్తరణ పూర్తి కావడంతో వాహనసేవకు ఎలాంటి ఆటంకాలు ఏర్పడలేదు.

అంతేకాదు అప్పటివరకున్న కౌతుకబేరాన్ని ఉత్సవ బేరంగా తపోబలంతో మార్చి బ్రహ్మోత్సవాలకు వాడుకొనేలా చేశారు. 'అళగప్పిరాన్' అనబడే సుందరస్వామి ధనర్మాసంలో కూడా శయనోత్సవంలో పాల్గొనడం సరికాదని ధనుర్మాసంలో శ్రీకృష్ణుడే శయనబేరంగా ఉండాలని కట్టడి చేశారు.

### దివ్యప్రబంధ అనుసంధానం

అన్నిటికంటే ప్రధానమైనది రామానుజులు ఆలయంలో జరిగే ప్రతి సేవకు అనుబంధంగా ద్రావిడ ప్రబంధపారాయణం నియతం చేయడం. అంతవరకు సంస్కృతశ్లోకం లేదా వేదమంత్రాలకే ప్రాధాన్యముండగా ద్రవిడ వేదం జతకావడం మార్పులలో పెనుమార్పు. తిరువీథులలో జరిగే ప్రతి ఉత్సవానికి ముందు శ్రీవైష్ణవులు రామానుజులు నిర్దేశించిన విధంగా నిర్దిష్ట పాశురాలను అనుసంధానించడం నాటికీ నేటికీ ఒకేరకంగా సాగుతూనే ఉంది.



ఉగాది నుండి 40 రోజులపాటు నిత్యకైంకర్యం చేసే జీయర్, తాళ్లపాకవారు, గమేకారులు, భజంత్రీలు మున్నగువారు భక్తుల సేవ నిమిత్తం నిత్యోత్సవం జరిగేలాగున కట్టడి చేయడం. రామానుజుల సన్నిధిలో అప్పుడు శ్రీవారికొలువు నిర్వహింపబడడం ఒక విశేషం.

### రామానుజుల అర్పణలు

ఈ అర్పణకు వ్యూహాలక్ష్మి సమర్పణ, నాగాభరణ సమర్పణలు ఉదాహరణలు.

### వ్యూహాలక్ష్మి స్థాపన

రామానుజులవారు చేసిన సముచితమైన అర్పణ బంగారు లక్ష్మిని (వ్యూహాలక్ష్మిని - ద్విభుజలక్ష్మిని) స్వామివారి వక్షఃస్థలంలో నిలపడం. ప్రస్తుత అలంకరణలో అసలు లక్ష్మి కనబడకపోవడంవల్ల విగ్రహం తాలూకు అనుమానాలు కూడా ఏర్పడడంతో రామానుజులవారు కొంచెం ఉబ్బుగా కనబడేలాగున వక్షఃస్థలంలో లక్ష్మిని పెట్టారు. ఆ లక్ష్మీదేవి ద్విభుజలక్ష్మి కావడం విశేషం.

### రామానుజ విగ్రహం

రామానుజులు తిరుమల ఆలయ పూజాదికాలు సక్రమంగా జరిగేలా వ్యవస్థచేసి, ఆ వ్యవస్థ బాగా జరపబడుతుంటే తిరుమల వదలి మరల శ్రీరంగం వెనుదిరగాలనుకొన్నారు. ఈ నిర్ణయం విని అనంతాళ్వాన్ చకితులయ్యారు. తనకు అన్నివేళల రామానుజ సాన్నిధ్యం ప్రసాదించమన్నారు.

రామానుజులు ఆలోచించి తనలాగే ఒక విగ్రహం తయారు చేయించారు. జ్ఞానముద్రతో ఉన్న ఈ విగ్రహాన్నే అనంతాళ్వాన్‌కు సమర్పించారు. ఆ విగ్రహమే నేడు తిరుమలలో హుండీ ఎదురుగా దర్శనీయంగా ఉంది.

### ఆలయసేవాదిక పర్యవేక్షణకు సంబంధించిన అంశాలు

రామానుజులవారు ఆలయ నిర్వహణకు సంబంధించి చక్కని ప్రణాళికను ఏర్పరచినవారు. ప్రత్యేకించి వైఖానస సంప్రదాయం జరిగేచోట పూజాదికాలను పర్యవేక్షించే బాధ్యతను జీయర్‌లకు కట్టబెట్టడం ఒకరకంగా సాహసమే.

తిరుమలలో అనంతాళ్వాన్ పుష్పకైంకర్యం చేసినవారు రామానుజుల సమకాలీనులు. శ్రీవారి ఆలయపూజాదులను సక్రమంచేసిన తరువాత వాటి పర్యవేక్షక తత్త్వాన్ని అనంతాళ్వాన్‌కు అంటకట్టారు. కొంతకాలానికి ఈ అధికారం సంసారులకు తగదని విరక్తులైనవారే ఉండడం సబబని "సేనాపతికి" అధికారం ఇచ్చారు. వారే మొదటి జీయర్. తరువాతి కాలంలో తిరువేంగడ రామానుజ జీయర్, వేంకట (అప్పన్) శఠగోప జీయర్, ఆపై అళగియ మణవాళ జీయర్, ఆపై ఎంబెరుణార్ తదనంతరం అప్పన్ శఠగోపజీయర్, పరాంకుశ జీయర్‌లు క్రమంలో సాగుతూ జీయర్ వ్యవస్థ ఉంది. ఇప్పటి జీయర్ ఆ సంప్రదాయంలోని 44వ వారు కావడం విశేషం. రామానుజులవారు గోవిందరాజులస్వామి ఆలయవ్యవస్థను చక్కబరచిన తరువాత మరొక జీయర్ ఆవశ్యకత ఏర్పడడంతో ఏ దివ్యదేశంలోనూ లేనట్టుగా పెదజీయర్, చినజీయర్ వ్యవస్థ ఏర్పడింది. వీటితో పాటే ఏకాంగుల అవసరం కూడా గుర్తించి రామానుజులవారు తగిన ఏర్పాట్లు చేశారు.

ప్రతిసేవ కూడా పెదజీయర్ లేదా ఆయన అధికారం పొందిన చిన జీయర్ ఏకాంగులు అందిస్తేనే గాని ప్రధాన అర్చకులు పూజాకైంకర్యాలను చేబట్టడం లేదు. ఇది నాటికి నేటికి మారని వ్యవస్థ కావడం విశేషం.

రామానుజులవారు తిరుమలకు మూడుసార్లు వచ్చారని పెద్దలు చెబుతారు. రామానుజుల ప్రశంస కలిగిన శాసనాలు కూడా ఆలయ కుడ్యాలలో కనిపిస్తున్నాయి. తొలిసారి స్వామివారి ఆలయంలో శంఖచక్రాదుల సమర్పించిన సందర్భం మొదటిది

కావచ్చు. రెండవసారి కాశ్మీరం సందర్శనా నంతరం అనేక దివ్యక్షేత్రాలు సందర్శిస్తూ తిరుమలకు విచ్చేసి మూడురోజుల పాటు తిరుమలలో గడిపారని 'పరమయోగివిలాసం' స్పష్టం చేస్తున్నది. భగవద్రామానుజులవారు తిరుమలలో సంవత్సర కాలంపాటు ఉన్నట్లుగా "తిరుమల సమయాచారములు" అనే గ్రంథంలో ఉటంకింపబడింది.

### ఇతరాంశాలు

రామానుజులవారు తిరుమలలోనే కాదు తిరుపతి లోనూ అనేక కైంకర్యాలు సమర్థవంతంగా నిర్వహించారు. తిరుమల శ్రీనివాసుని సేవించినట్లే తిరుపతి గోవిందరాజ స్వామి కైంకర్యాలు చేశారు.

### చూడికుడుత్తనాచ్చియార్ ఆలయం

తిరుమలలో స్వామి ఒకడే గర్భాలయంలో సాక్షాత్కరి స్తాడు. ఆ మూర్తి వక్షఃస్థలంలో వ్యూహాలక్ష్మిని నిలిపినట్లే గోవిందరాజస్వామికి ఒక దేవిని ప్రతిష్ఠించాలనుకొన్నారు రామా నుజులు. యథావిధిగా వ్రాయబడిన, యంత్రమంత్రోద్ధారాదు లతో అలంకృతమైన, దివ్యాసనం అధిష్ఠించిన శ్రీ గోదాదేవిని గోవిందరాజస్వామికి దక్షిణపార్శ్వంలో ఒక ప్రత్యేకమందిరం నిర్మించారు. ఆ తల్లిని గోవిందరాజు ప్రధానమహిషిగా నిరూ పించారు.

### ఆళ్వారుల ప్రతిష్ఠ

వైష్ణవాలయాలలో ఆళ్వారుల విగ్రహాలు తప్పక ఉంటాయి. అయితే ఆళ్వారులు తిరుమలేశుని 'అలిపిరి' నుండే సేవించారని ఒక కథనం. ఆ కారణాన రామానుజులు తిరు మలలో అనేక వైష్ణవచిహ్నాలను పునరుద్ధరించి నారు గాని ఆళ్వారుల విగ్రహాలను మాత్రం ప్రతిష్ఠించలేదు. వేంకటపతి అభిన్నుడైన గోవిందరాజస్వామివారి ఆలయంలో ఆ విగ్రహాలను ప్రతిష్ఠించారు.

### శ్రీరామానుజుల కట్టడి

తిరుమలలో రామానుజులు పూజాదికాలలో కట్టడి చేసినట్లే తిరుపతి గోవిందరాజస్వామి ఆలయం లోనూ ఎన్నో 'కట్టడు'లు చేశారు. వాటిలో ప్రధాన మైనది దివ్యప్రబంధ అధ్యయనం. ప్రతిసేవలోనూ నిర్దిష్టపాశురాల అధ్యయనం.

### తిరుమల, తిరుపతులలో 'పాశురాల' విధానం

తిరుమలలో వేంకటేశ్వరస్వామివారికి సంధ్యా సమయంలో వేదపారాయణంతో శ్రీవేంకటాచల మాహాత్మ్యం, శ్రీచిత్రకూట మాహాత్మ్యం అవధరింపచేసేటట్లుగానే తిరుపతిలో గోవిందరాజస్వామికి చిత్రకూటమాహాత్మ్యం, వేంకటాచలమాహాత్మ్యం అవధరించేలాగున కట్టడి చేశారు.

సాయంసమయాన శ్రీనివాసునికి నిత్యానుసంధానం చేసేవేళ 'తిరుమొళి' ప్రబంధంలోని 'ఊన్‌వాడ ఉణ్ణాదు' (శరీరం కృశించినా భుజింపక) 'వాడమరుదిడై' (మద్దిచెట్లనడుమ మర్దించునట్లుగా) అనే పాశురాలను అనుసంధానించి పాడినట్లే తిరుపతి గోవిందరాజస్వామి ఆలయంలో 'ఒళివిల్ కాలమెల్లాం' (విరామం ఏ మాత్రంలేని) 'ఉళగముంద పెరువాయా' (లోకాలన్నిటిని మింగగలిగిన పెద్దనోరు కలవాడా) అనే రెండు పాశురాలను అవధరించేలా కట్టడి చేశారు. శ్రీవేంకటాచల నివాస!, చిత్రకూట విహార! అని ఉభయపదఘటితంగా ఉభయులకు గద్యబిరుదాది అనుసంధానం చేయాలనే వ్యవస్థ ఏర్పరచారు.

### తిరుచానూరు అలమేలుమంగమ్మ తాయారుకు 'సారె' అంపకం-

తిరుమలకు పుష్పమండపమని పేరు. కొండమీది పువ్వులన్నీ స్వామి వారికే. ఇతరులు పూలు ముడువరాదు. ఆలాగే ఇతర దేవాలయాలలో లాగే మూలవరుల, ఉత్సవవరుల పూలను భక్తాదులకు ప్రసాదించే విధానం లేదు. శ్రీవారికి సమర్పించే పూలన్నీ ఆ తరువాత 'పూలబావి'లో భూదేవికి సమర్పింప బడతాయి.

కాని సంవత్సరంలో ఒక్కసారి మాత్రం తిరుచానూరు పద్మావతీదేవి ఉత్సవాలలో ప్రధానభాగమైన 'పంచమీ'తీర్థంరోజు తిరుమలనుండి పసుపుకుంకుమలతోబాటు పూలమాలలు



తిరుచానూరుకు సారెరూపంలో వచ్చేలాగున రామానుజులు కట్టడి చేశారు.

"గోవిందరాజస్వామికి" అన్ని హంగులు సమకూరేలా యాదవరాజును ప్రోత్సహించి మంటపం, పుష్కరిణి, మాడ వీథులు మొదలైనవి రామానుజులవారు పెంచగలిగారు. తిరుమలలోలాగే గోవిందరాజస్వామి ఆలయ పూజాదికాలు సక్రమంగా జరిగేలా పర్యవేక్షకులుగా, కైంకర్యపరు లుగా జియ్యర్, ఏకాంగులను కూడా నియమించడం మరో ప్రత్యేకత.

ఆలయనిర్మాణం ఒక ఎత్తైతే, ఆలయకైంకర్యాలు సక్రమంగా జరగడం పై ఎత్తవుతుంది. ఈ కారణంవల్లనే ఆలయ ప్రతిష్ఠ పెరుగుతుంది. దూరప్రాంతాలవారిని కూడా ఆకర్షిస్తుంది. అంతేకాదు జవాబుదారీతనం వల్ల కైంకర్యాదుల పట్ల అర్చకులకూ, అలాగే పర్యవేక్షకులకూ శ్రద్ధాసక్తి పెరుగుతుం దనడంలో సందేహం ఏ మాత్రం లేదు. తిరుమల శ్రీవారి ఆలయ నిర్వ హణలో తరువాతికాలంలో ఎన్నో మార్పులు వచ్చి ఉండవచ్చు కానీ నేటికిని ప్రధానమైన కైంకర్యాలు తు.చ. తప్పకుండా నిర్వహింపబడుతుండడంలో రామానుజుల స్థిర సంకల్పబలాన్ని ప్రశంసించక తప్పదు. రామానుజులు 'అనంత' అంశజులు. వారి కైంకర్యాలు అనంతములే.

మే, 09
తరిగొండ వేంగమాంబ జయంతి

# ముత్యాలహారతి



ప్రతిరోజు రాత్రిపూట చివరగా ఏడుకొండల స్వామికి ఏకాంతసేవ జరుగుతుంది. ఏకాంతసేవ అంటే పవ్వళింపు సేవ అని అర్థం. శ్రీవారి గర్భాలయానికి ముందు ఉన్న శయనమండపంలో ఏకాంత సేవకుగాను, వెండి గొలుసులతో వేలాడదీసిన బంగారు నవార పట్టె మంచంపై "మనవాళ పెరుమాళ్" (నిత్యనూతన వరుడు) అనబడే భోగశ్రీనివాసమూర్తిని వేంచేపు చేస్తారు. ఆ సమయంలో ఆనందనిలయంలో శ్రీస్వామివారి మూలవిరాణ్మూర్తికి చిట్ట చివరగా **"ముత్యాలహారతి"** అనబడే మాతృశ్రీ తరిగొండ వెంగమాంబగారి మంగళకర్పూర నీరాజనం ఇవ్వబడుతుంది.

పిదప అదే హారతిని బయటికి తీసుకవచ్చి పట్టెమంచంపై పవ్వళించి ఉన్న భోగశ్రీనివాసమూర్తికి ఇవ్వడం జరుగుతుంది. ఆ మంగళహారతి వెలుగుల్లో శ్రీస్వామివారు వెండి గొలుసులతో వేలాడదీసిన పట్టెమంచంపై ఊగుతూ ఉండగా, అదే సమయంలో, రాములవారి మేడ, నడవలో శ్రీస్వామి వారికి ఎదురుగా దండెను మీటుతూ తాళ్లపాక అన్నమాచార్యుల వంశీయు లొకరు "జో అచ్యుతానంద, జో జో ముకుందా! రావె పరమానంద రామ గోవిందా!" అంటూ జోల పాట కమ్మగా పాడుతారు. ఒకవైపు తరిగొండవెంగమ్మగారి హారతినందుకొంటూ, మరోవైపు తాళ్లపాక వారి లాలిపాటను వింటూ యోగనిద్రకు ఉపక్రమిస్తూవున్న మనోహరదృశ్యాన్ని శ్రీవేంకటప్రభువుల దివ్య తేజస్సును చూచి తీరవలసిందే కాని, వర్ణించడానికి మాటలు చాలవు. లేవు కూడ.

తిరుమల క్షేత్రంలో నేటికీ ప్రతిరోజు రాత్రి ఏకాంత సేవా సమయంలో చివరగా శ్రీవేంకటేశ్వరస్వామి వారికి తాళ్లపాక అన్నమాచార్యులవారి వంశీయులచే లాలిపాట, జోలపాట వినిపించబడుతుంది. అదే సమయంలో తరిగొండ వెంగమాంబవారి ముత్యాలహారతి జరుగుతుంది. ఇలా ప్రతిరోజు రాత్రి చివరగా ఇరువురు పరమభక్తులచే తిరుమల శ్రీవారు అందుకొంటూవున్న ఈ విశిష్టసేవలను తెలిపే నానుడే **"తాళ్లపాకవారిలాలి - తరిగొండవారి హారతి".**

# శ్రీ భగవద్రామానుజుల సహస్రాబ్ది జయంతి ఉత్సవాలలో భాగంగా తి.తి.దే. ప్రారంభించిన శ్రీ రామానుజాచార్యుల దివ్యదేశ సంచార రథం



# శ్రీ భగవద్రామానుజులవారి సహస్రాబ్ది ఉత్సవాల సందర్భంగా



తిరుమలలో రథయాత్ర ప్రారంభం



తిరుపతిలో ఉత్సవాల ప్రారంభం



కాంచీపురంలో శ్రీవారి కల్యాణోత్సవం



శ్రీవారి కల్యాణోత్సవం (సేలం)



మధురాంతకంలో శ్రీవారి కల్యాణోత్సవం



శ్రీ పెరుంబుదూరులో శ్రీవారి కల్యాణోత్సవం



ఆళ్వారు తిరునగరిలో రథయాత్ర



తిరుపతిలో రథయాత్ర

# తి.తి.దే. నిర్వహించిన వివిధ విశేష కార్యక్రమాల దృశ్యమాలిక!



తిరుక్కురుంగుడిలో భక్తులు



తిరుక్కురుంగుడిలో శ్రీవారి కల్యాణోత్సవం



చిదంబరంలో శ్రీవారి కల్యాణోత్సవం



తంజావూరులో భజన కార్యక్రమం



శోలింగరంలో శ్రీవారి కల్యాణం



తిరుపతిలో జరిగిన శ్రీరామానుజ సదస్సు



తిరుపతిలో జరిగిన శ్రీరామానుజ ప్రసంగాల సభ



తిరుపతిలో గ్రంథావిష్కరణలు



# నీ.. దయాఋణం ఎలా తీరేది?

- ముక్తి

**ఆ**దిశేషుడవై
వైకుంఠంలో శ్రీమన్నారాయణమూర్తికి
శయనమై, పీఠమై, పర్యంకమై, నివాసమై
ఒక్క క్షణం కూడా కనురెప్ప వేయకుండా
స్వామి నిత్యవిభూతిని వేలకన్నులతో దర్శించే
నిత్యసూరుడైన నీవు
ఒక్క క్షణమైనా స్వామి ఎడబాటును ఓర్చుకోని నీవు
మా అందరికోసం
మా అందరి మధ్య
భక్తిబంధంతో ప్రతి గుండెనీ గుడిగా మలిచేందుకు
వైకుంఠాన్ని వదలి నేలకు దిగివచ్చావు

**'ఓ రామానుజా'**
ఈ వేయి వసంతాలవేళ
నీకు వేల వేల వందనాలు.
తిరుక్కోట్టియూర్‌లో గుడిగోపురం ఎక్కి
గుడి చుట్టూ చేరిన పామరజనానికి, పాటకజనానికి
ఓం నమో నారాయణాయ! అని
దిక్కులు పిక్కటిల్లేట్లు గొంతువిచ్చి
నీవు చేసిన మంత్రోపదేశం
సకలజనులు జనార్దనుని చేరుకోవడానికి అర్హులే
అన్న నీ తాత్త్వికచింతన
ఎన్ని వేలఏళ్ళకైనా ఇలాగే నిలిచి ఉంటుంది.

కావేరీ నదిలో
స్నానాది అనుష్ఠానాల తర్వాత
ధనుర్దాసు భుజంపై చేతులు వేసినపుడు,
మేల్‌కోటలో
స్వామి దర్శనభాగ్యానికి యుగయుగాలుగా నోచుకోని
దళితనారాయణులకు ఆలయప్రవేశం కలిగించినపుడు
చుట్టూ ఉన్న ఉష్ట్రపక్షులు, కూపస్థమండూకాలు
నిన్ను శాపాలు పెట్టినా,
నీపై కోపాలు చూపినా,
హరిభక్తికి అంతమెక్కడ అన్నది
జీవనసూత్రంగా నీవు నడిపిన భక్తిఉద్యమానికి
మేమేమి ఇవ్వగలం
అంజలి ఘటించడం తప్ప.
**నీ దయాఋణం** తీరేదికాదు.



గతులన్నీ ఖిలమై
లోకం పెడమార్గాన కదలిపోతున్నప్పుడు
నీవొక్కడివే భక్తిశిఖను వెలిగించి
పెంజీకటికవ్వలి పరమాత్మను
కనులారా దర్శింపజేయడానికి నీవు పడిన తపనని
ఏమని వర్ణించేది.

జపం, తపం, దానం, యజ్ఞం, పుణ్యం, పాపం
అన్నింటికీ అతీతంగా
కులం, మతం, ప్రాంతం, వర్ణం తేడా లేకుండా
భక్తి అనే ఏకైక ఉపాయం మీద
భగవంతుణ్ణి మనిషికి
అత్యంత ఆప్తుడుగా మార్చిన నీ జీవనపథం
ఎన్నిసార్లు స్మరించుకున్నా పుణ్యప్రదమే అవుతుంది.

ఇవ్వాళ మేమందరం
సీతమ్మ మా అమ్మ, శ్రీరాముడు మా తండ్రి అనుకున్నా
ప్రతి పసిబాలుడు "చేరి యశోదకు శిశువితడు"
అనుకున్నా

మా దేవుడు విహాయసవీథులలో లేడు
మా దేవుడు,
మా తండ్రి, మా బిడ్డ,
మా చెలికాడు, మా బంధువు,
మా ఆత్మీయుడు, మా సర్వస్వం,
మాకు అన్నీ కూడా.

ఇలా ఎన్నో రకాలుగా దైవాన్ని
అత్యంత ఆత్మీయుడుగా చేసి
శరణాగతి తత్త్వాన్ని
మాకు వారసత్వంగా వ్రాసి ఇచ్చిన
**నీ దయాఋణం ఎలా తీరేది.**

నీకు మేము ఏమి ఇవ్వగలం.
నీ పాదాలకు శరణనడం తప్ప.
అందుకనే –
ఈ వేయి వసంతాల వేళ
నీకు వేన వేల వందనాలు.

## వైకుంఠపాళీ
### :: *18* – సమాధానాలు ::

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 చి | త్ర | 2 భా | ను | 3 డు | | 4 కుం | కు | 5 మ |
| లు | | లు | | బు | | జ | | హి |
| 6 క | రి | కా | లు | డు | | 7 ర | త్తై | త |
| | | రు | | క్క | | యూ | | గి |
| 8 భ | వి | ష్య | 9 ము | | 10 రా | ధం | 11 త | రి |
| ర | | | 12 రా | వ | ణి | | మా | |
| 13 త | ల్ప | గి | రి | | 14 రు | ద్ర | భూ | 15 మి |
| ము | | | ప్రి | | ద్ర | | | ను |
| 16 ని | క | వ | య | | 17 మ | క | ర | ము |

# 'సేవ' ఒక 'భాగ్యం'

– ముక్తి

ఒక చిన్న నది ఒడ్డుకి ఓ తల్లి ఒక చేత్తో పసిబిడ్డను ఎత్తుకొని, ఇంకో చేత్తో బిందె తీసుకొని నీళ్ళు తెచ్చుకోవడానికి బయలుదేరింది.

నీళ్ళని బిందెలో పట్టుకునేటప్పుడు బిడ్డను ఎదురుగా ఒక యువకుడు నిల్చొని ఉంటే అందించింది. ఆ పసిబిడ్డని యువకుడు ఎత్తుకొని నిలబడ్డాడు. బిందె నీళ్ళు నింపుకొని ఇంటికేసి ఆమె నడుస్తున్నది. యువకుడు మీ ఇంటిదాకా నేను బిడ్డను తీసుకొస్తానని వెంట నడుస్తున్నాడు. ఊళ్లో మలుపులు తిరిగి, ఊరంతా నడిచి మారుమూల ఒక చిన్నగుడిసె లాంటి ఇంట్లోకి ఆ తల్లి వెళ్ళింది. ఆ తల్లికి ఈ యువకుడు బిడ్డను అందించాడు.

దూరంగా ఒక బంట్రోతు పరిగెత్తుకుంటూ ఆ యువకుడివైపు వచ్చాడు. సార్. మీరు ఏమయ్యారోనని కంగారు పడ్డానని అన్నాడు.

**"ఏమీ కాలేదులే ఆమె బిందెతోపాటు బిడ్డను కూడా మోయలేదు కాబట్టే కొంచెం సహాయం చేశాను"** – అన్నాడు ఆ యువకుడు.

కథ వెనక్కి వెళితే ఆ యువకుడు ట్రైనింగ్లో ఉన్న యువ ఐ.ఎ.ఎస్. అధికారి. మనం ఈ సంఘటన చూస్తే మనకి అర్థమయ్యేది ఏమిటి అనేది విశ్లేషించుకుంటే.

**'సేవ' ఒక అవకాశంగా భావించాలి.**
ఎప్పుడో ఒక ఆదివారం సేవ చేస్తాను.
నెలకు ఒకసారి ఒక రోజు చేస్తాను.
పుష్కరాలప్పుడే సేవ చేస్తాను.



అనుకోకుండా ఎప్పుడు ఏ అవకాశం వచ్చినా మనకు పరమాత్ముడు అనుగ్రహించి ఇచ్చిన సేవాభాగ్యంగా భావించాలి.

**వివేకానందస్వామిలాంటి మహనీయులందరు కూడా**
**నిరుపేదలని –**
**అభాగ్యులని –**
**సమస్తమూ పోగొట్టుకున్నవాళ్ళని –**
**ఆదరించమన్నారు, అక్కున చేర్చుకోమన్నారు.**
**దరిద్రుడు** కనిపిస్తే **దరిద్ర నారాయణునిలాగా,**
**రోగి** కనిపిస్తే **రోగి నారాయణునిలాగా,**
**పేద** కనిపిస్తే **పేద నారాయణునిలాగా** భావించమన్నారు.

సాక్షాత్తూ నారాయణమూర్తే ఆయా రూపాల్లో మన ముందు నిల్చొని నీకు సేవించుకొనే భాగ్యాన్ని కల్పిస్తున్నాడని భావించాలి. అందుకనే భీష్మపర్వంలో ఒక అపురూపమైన శ్లోకం ఉంది.

**నమోస్త్వనంతాయ సహస్రమూర్తయే**
**సహస్రపాదాక్షి శిరోరుబాహవే ।**
**సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే**
**సహస్రకోటియుగధారిణే నమః ॥**

(అనేక రూపాలతో, అనేక పాదాలతో, అనేక కన్నులతో, అనేకశిరస్సులతో విరాజిల్లుతున్న అనంతుడైన నారాయణమూర్తికి నమస్కరిస్తున్నాము– అని అర్థము)

మనం పైన చెప్పుకున్న అంశాలని మనం స్వయంగా అన్వయించుకొంటే, మనకు కనబడుతున్న కోట్లాది తలలు, కంఠాలు, చేతులు అన్నీ శ్రీమన్నారాయణ మూర్తికి చెందినవే.

ఆయనకు కానిది ఏదీ లేదు. ఆయన లేనిది ఏదీ లేదు. మన చుట్టూ తిరుగుతున్న సమస్త జంతుజాలం, మానవాళి ఆయన రూపాలే. మన కంటికి కనిపిస్తున్న నరులందరూ ఆ నారాయణ మూర్తి అంశలే.!

సేవిద్దాం... తరిద్దాం....!

# కైంకర్యమే.. తనువు దాల్చితే....

13

- డా॥ కంపల్లె రవిచంద్రన్



**(తిరుమల నంబి శ్రీరామానుజులు వారికి శ్రీయామునాచార్యులవారి గురించి వివరించడం ఈ సంచికలో చదువవచ్చు.)**

శ్రుతి అనే స్త్రీని అందరూ ఈడ్వనారంభించారు. వారి వారి బుద్ధికితోచినట్లు, వారికి వారికి తగినట్లు ఈ వేదానికి ఇలా అర్థం, అలా అర్థం అని తెలుపుకుంటూపోయారు. దీంతో శ్రుతి అనే మహిళ అల్లాడిపోతుండేది. నేనెవరికి చెందాలో వారికి దూరం చేశారు. ఎవ్వరినెవ్వరినో తెచ్చారని ఏడ్చితే, "అమ్మా! భయపడకుమని" చెప్పి ఉడయవరులు ఆమెను స్వామితోడ చేర్చారు.

ఉడయవరులు అని గొప్పగా చెప్పుకుంటున్నాం. పండితుడనా? సాధారణంగా ఒకరి గొప్ప తెలియాలంటే వారి విద్యా వంశాన్ని, జన్మవంశాన్ని చూడాల్సి ఉంటుంది. అంటే వారి గురు పరంపర బాగుండాలి. తండ్రి, తాత మొదలైన వారి సంగతి అంతే గొప్పగా ఉండాలి. అంతేగాక, వీరికీ గొప్ప ఉండాలి, భగవత్కృప కలగాలి. అప్పుడే గొప్ప కలుగుతుంది. మహోపకారులైన ఉడయవరుల సంగతి తెలియాలంటే నాథమునులచరిత్ర నుండి తెలుసుకోవాలి.



కావేరికి స్వర్ణనది, కనకనది అని పేర్లు. ఆ నదీతీరంలో వీరనారాయణపురమనే గ్రామంలో సంగీత, సాహిత్య విద్వాంసు లుండేవారు. ఈశ్వరభట్టర్ ఆ విద్వాంసులలో మణి లాగా ప్రకాశించేవాడు. వారి కుమారుడే నాథ మునులు. వారిది ప్రసిద్ధమైన శొట్టయి కులం. నాథ మునులు సేనమొదలి ప్రధానమంత్రి అయిన గజ ముఖుని అంశలో అవతరించారు. వీరు కలియుగం 3264 సంవత్సరాలు పోగా శోభకృతుసంవత్సరం జ్యేష్ఠమాసం అనూరాధానక్షత్రం బుధవారంరోజున అవతరించారు. నాథమునులు సేనమొదలిమంత్రి అనుకున్నాం కదా, అంతేకాదు, తిరుపతి శ్రీనివాసుడు, నాథమునియై అవతరించారు.

కారణమేమంటే, ఢిల్లీ పాదుషాకు సంతానం కలుగ లేదు. అతడు సంతానం కోసం శ్రీరాముని గురించి తపస్సు చేశాడు. స్వామి ప్రత్యక్షమై – "నీకు సీత కూతురై పుడుతుందని" చెప్పాడు. కొంతకాలానికి బంగారుతామరపూవులో లక్ష్మి పుట్టింది. ఆమెకు 'సురతాని' అని పాదుషా పేరు పెట్టాడు. ఆమె మహా

లక్ష్మి గనుక భగవద్విషయాలపై ఆసక్తి కలిగి ఉండేది. పాదుషా మహమ్మదీయుడైనా శ్రీరామునిపై భక్తికలిగి ఉండేవాడు. కనుక, అతని దగ్గరకు ఎంతోమంది పెద్దలు, పండితులు వచ్చే వారు. నూటఎనిమిది దివ్యదేశాలవిశేషాలు వాళ్లు పాదుషాకు వివరిస్తుంటే, సురతాని కూడా తండ్రితో పాటు ఆ విశేషాల్ని ఎంతో ఆసక్తిగా వినేది. అలా ఆమె శ్రీరంగనాథుని వివాహం చేసు కోవాలనుకుంది.

ఒకసారి నారదుడు శ్రీరంగానికి వెళితే, "నారదా! విశేషాలేమి"టని స్వామి అడిగాడు. "స్వామీ! నీ కల్యాణగుణాలను పాదుషా కూతురు విని నిన్ను పెళ్లి చేసుకోవాలనుకుంటోంది" అని చెప్పాడు నారదుడు.

"ఆ సంగతి నీకెలాతెలుసు?" అని స్వామి అడిగాడు. "స్వామీ! ఆమె పూదోటలో విహరిస్తుంటే, నేనటు వెళ్లాను. ఆమె ముఖంలో విచారరేఖలు గమనించి కారణమడిగాను.

అప్పుడామె మీపై గల ఇష్టాన్ని వ్యక్తీకరించి "ఎలాగైనా స్వామిని తీసుకు రమ్మని" నన్ను అర్థించింది" అన్నాడు నారదుడు.

అది విని, "తనను అక్కడకు తీసుకుపొమ్మని" స్వామి నారదునితో చెప్పాడు. అటులే కానిమ్మన్నాడు నారదుడు. ఆ తర్వాత నారదుడు చోళరాజు క్రిమికంఠుడి దగ్గరకు వెళ్ళి "రాజా! నీవు స్వతంత్రంగా పరిపాలన చేయువాడవా? కప్పం కట్టే వాడివా?" అని అడిగాడు. "ఢిల్లీకి కప్పం చెల్లించే వాడినని" క్రిమి కంఠుడన్నాడు.

నారదుడు "మ్లేచ్ఛుల కేల కప్పం చెల్లిస్తావు? రంగనాథు డుండగా నీకు భయమేమి? కప్పం చెల్లించవద్దని చెప్పి", కప్పం మాన్పించాడు.

తర్వాత పాదుషా దగ్గరకు వెళ్లి, "అందరూ తమరికి కప్పం సక్రమంగా చెల్లిస్తున్నారా?" అని అడిగాడు. చోళరాజు కట్టడం లేదని, అతనితో యుద్ధంచేసి, జయించి రమ్మని తన మంత్రి నీలకంఠీరవాచార్యుల్ని పంపాడు. అతడు వెళ్లి, చోళరాజును జయించి, అతనికి సంకెళ్లు వేసి, శ్రీరంగనాథుని ఎత్తుకుని పల్లకీలో పెట్టుకుని తీసుకువచ్చి స్వామిని సురతానికిచ్చాడు. శ్రీస్వామి మనుష్యరూపంతో ఆమెకు చేరువయ్యాడు. శ్రీరంగనాథుడు లేనందువల్ల చోళదేశంలో క్షామం సంభవించింది. శ్రీరంగనాథుడు వెళ్లి పోగానే అసూయపరు లైన కొందరు దుర్మార్గులు నమ్మాళ్వార్ ఆనతిచ్చిన తిరువాయ్ మొళికి- 'కొల్లుంపాట్టు' అంటే, 'చావు పాట' అని పేరు పెట్టి కాల్చి వేశారు.

అసురసంధ్యాతమస్సులు జడలువిచ్చుకున్నప్పుడు, గగనంలో తారకలు తళతళలాడుతాయి. తమిస్రలు తాండవించి నప్పుడు- ఆ తిమిరాలతో కిరణాలు సమరాలు చేస్తూనే ఉంటాయి.

నిశిరాతిరిలో శశిరేఖ వెలుగుతుంది. గృహాల ప్రాంగణా లలో మణిదీపాలు ప్రజ్వలిస్తాయి. ఇది సృష్టిరహస్యం. అజ్ఞానం అలుముకున్నప్పుడు, సుజ్ఞానం ఉషస్సులా ఉదయిస్తుంది. ధర్మానికి గ్లాని జరిగినప్పుడు అవతారపురుషులు ఆవిర్భవిస్తారు.

ఇది కాలచక్రభ్రమణం. ఇది జన్మచక్రచలనం. ఈ లీలా మానుషకేళిలో తిమిరాల తోటి సమరాలు నిత్యనూతనాలు. సిద్ధులు, యోగులు, విరాగులు పరమాత్మ కార్యోపకరణాలుగా అవతరిస్తూనే ఉంటారు.

అది తమిళదేశం. ఆనాడు తమిళప్రజలు అంధకారానికి బంధువులై పోతున్న తరుణం. అక్షులున్న అంధులకోసం అక్కడ ఆళ్వారులు, నాలుగు చెఋగులా, నాలుగువేలదివ్వెల్ని వెలిగిం చారు. ఆ నాలుగు వేల దీపస్తంభాలే "నాలాయిర దివ్యప్రబంధం" లోని పాశురాలు.

దీపం-పాలరాతి మందిరంలోను వెలుగుతుంది. పాడు బడ్డ పాకలోనూ ప్రకాశిస్తుంది. విష్ణుభక్తులైన ఈ ఆళ్వారులు అన్ని వర్గాల జనుల నుండి ప్రభవించినవారే. వెలివాడల నుంచి, కడ వరుల గడపలనుండి పుట్టుకొచ్చిన కాంతిపుంజాలు వీరు. ఆళ్వారు లంటే- "తమలోని భక్తిరస భావజలధులను కొలవడానికి అలవి మీరినవారు" అని అర్థం.

అపారమైన భక్తి, వైరాగ్య, శృంగార, లౌకిక, అలౌకిక- సూక్తులకు సూత్రధారులు వీరు. స్రష్టలు, ద్రష్టలు వీరే! పాలకడలిపై తేలి ఆడే కంసారిపై భక్తితో, సాంసారిక చింతన వదిలిన రాజ హంసలు, భక్తితో పరమానంద సముద్రం లోతును తెలుసుకున్న మందరపర్వతాలు ఆళ్వారులు.

శ్రీహరి దివ్యగాథలను, పవిత్రమైన పేర్లను, దివ్యగుణా లను ఎల్లప్పుడూ స్మరించడం వల్ల భక్తి కలుగుతుంది. నిర్మల భక్తితో పొందిన అలౌకిక తాదాత్మ్యతతో, అనుభూతులను ప్రీతితో అందించితేనే పాశురాలయ్యాయి. తమిళ మంత్రాలయ్యాయి. పులు కడిగిన ముత్యాల్లాంటి ఆళ్వారుల స్వచ్ఛమైన మనోమౌక్తిక వల్మీకాల నుంచి వెలువడిన వాణిలో ఓజస్సు, తేజస్సు, దీప్తులు కలిసి ఉన్నాయి. వీటిని మళ్లీమళ్లీ స్మరిస్తే, మాటలకు అందని, మనస్సుకు మాత్రమే అర్థమయ్యే దివ్యానుభూతితో కమలనయ నుడి సాక్షాత్కారం జరుగుతుంది. అయితే ఈ మంత్రమయ పాశురాలు గొప్ప భాషాపాండిత్యాన్ని కల ప్రౌఢభక్తికావ్యాలు కావు.

మహావేదాంతరహస్యాలకు నగిషీలు చెక్కిన సంప్రదాయ ప్రయోగ ఖండికలు అంతకన్నాకావు. అందమైన, అతిసుకుమారమైన, అమలినమైన భక్తిభావనల సమాహారమే నాలాయిరం.

మట్టి, నీళ్లు, నిప్పు, గాలి, నింగి – ఇవే మనిషి లోపల, బయట ఉన్నాయి. ఇవన్నీ శ్రీహరి విలాసాలే కదా! ఆ అంతర్యామి శ్వాసం వేదం. ఆ వేదవేద్యుని ఆలోచనలనే పుష్పాల నుండి వెలువడిన సువాసనలు కదా ఈ పాశురాలు.

ఇవి వేదాల్లా ఎందుకు కల్యాణసౌరభాలను విరజిమ్మవు? శ్రీవిష్ణుసహస్రనామాల్లో ఏనాడో గంగాపుత్రుడు 'భూతాత్ముడి'గా తెలియజేశాడు. అందువల్ల ఆనంద రసస్వరూపుడైన పరమాత్ముని తొలిపలుకులు వేదాలు ఎంతటివో – ఆ పరమాత్ముని భక్తి భావనతో, ఆనందరసధారలలో మునిగిన ఆళ్వారుల పలుకులూ అంతటి మంగళకరాలే! భూతాత్ముని చింతనతో పూతాత్ములైన ఆళ్వారుల కల్యాణజీవనాలు, పలుకుల సారాంశాలు అక్షయమైనవి, వెలలేనివి.

ఈ ఆళ్వారులలో శ్రీమన్నారాయణుని సేనాపతి, వేత్రహస్తుడైన విష్వక్సేనుని అంశంతో జన్మించినవారు నమ్మాళ్వారు.

*(ఇంకా ఉంది)*

బాలప్రబోధం

# విభీషణుడి హితబోధ

– శ్రీమతి కుసుమ.కె.మూర్తి

సీతా లక్ష్మణసమేతుడై శ్రీరాముడు అరణ్యాలకు వెళ్లాడు. పంచవటిలో ఒకపర్ణశాలను నిర్మించుకొని ఉన్నారు. సీతాదేవిని కామించిన రావణాసురుడు మారీచుని బంగారు లేడి రూపంలో ఆ పర్ణశాల పరిసరాలకు పంపాడు. చెంగుచెంగున ఎగురుతూ ముచ్చట గొలుపుతున్న ఆ బంగారులేడి కావాలని కోరింది జానకి, సీత ముచ్చట తీర్చాలని వెళ్లిన రాముడు మాయ లేడి పరుగులకు విసిగి బాణంవేశాడు.

అది 'హా! లక్ష్మణా!" అని అరవటంతో రాముని కేదో ఆపద వాటిల్లిందని లక్ష్మణుని వెళ్లమంది సీత. కాదనలేక లక్ష్మణ రేఖ" గీసివెళ్లాడు లక్ష్మణుడు. ఇంతలో మాయాజంగమరూపంలో రావణుడు వచ్చి "లక్ష్మణ రక్షణరేఖను దాటించి ఆమెను అపహరించి లంకానగరానికి తీసుకెళ్లి అశోకవనంలో నిర్బంధించాడు.

రామలక్ష్మణులకు సుగ్రీవాంజనేయులతో మైత్రి కుదిరింది. హనుమంతుడు సీతాన్వేషణలో బయలుదేరి సముద్రాన్ని దాటి లంకాపురి చేరుకొని సీతను చూసి రామముద్రిక నిచ్చాడు. సీత ఆనందానికి అవధులు లేవు. రావణుడి దృష్టిని ఆకర్షించాలని, తగినబుద్ధి చెప్పాలని లంకాదహనం చేశాడు పవనతనయుడు. అనుకున్నట్లే అంజనీపుత్రుని రావణుని ఎదుట నిలబెట్టారు రాక్షస వీరులు.



"ఓ వానరా! నిజం చెప్పు నీవెవరవు? రమణీయమైన లంకాపురిని ఎందుకు సర్వనాశనం చేశావు'? అని అడిగాడు రావణుడు.

"దశకంఠా! రావణా! నేను శ్రీరామబంటును. సుగ్రీవునికి మంత్రిని, పవన కుమారుడను. అబద్ధం చెప్పాల్సిన అవసరం నాకు లేదు. శ్రీరాముని ధర్మపత్ని అయిన సీతమ్మను అపహరించి తెచ్చిన దురాత్ముడవు. పరకాంతను కామించటం కంటే ఘోర పాపం ఇంకేమైనా ఉంటుందా? లంకాపతీ! నీదుశ్చర్యకు పశ్చాత్తాప పడి సీతామహాసాధ్విని రాఘవుడికి సమర్పించు. సకల గుణాభిరాముడు, కల్యాణ రాముడు అయిన మా శ్రీరామచంద్రుని శరణు వేడు. ఆ దయాసాగరుడు, ఆర్తత్రాణపరాయణుడు శరణన్న వారిని రక్షిస్తాడు. కోరి లంకకు చేటు తెచ్చుకొనకు, వంశ నాశనానికి ఒడికట్టవద్దు. పరస్త్రీ వ్యామోహం మహాభయంకరమైన వ్యసనం, నరకసదృశం. సీతామాత మహాపతివ్రత, పుణ్యచరిత. ఆమెను దుఃఖపెట్టకు. ఆమెక్రోధాగ్ని జ్వాలల్లో నీవు, నీ మహారాణులు, నీవంశం, నీ రాచరికపు వైభోగం, నీకు అత్యంత ప్రియమైన లంకానగరం మాడి బూడిదైపోతాయి. అవశ్యం రాముని చరణాలపై వ్రాలు" అని హితబోధ చేశాడు హనుమ.

క్రోధావేశంతో కుతకుతలాడిపోతున్న అన్నను చూసి విభీషణుడు 'అన్నా! వినదగు నెవ్వరు చెప్పిన'– అన్నారు కదా! పవనాత్మజుని మాటలు తేనె బిందువులు. నీవు ఆలకించిన మాటలను పునశ్చరణ చేసుకో, వివరించుకో! నీ శక్తియుక్తులన్నీ కల్ల! రామచరణమే మనకు శరణం. అదేసత్యం! అదేనిత్యం! సీతాసాధ్విని శ్రీరామునికి అప్పచెప్పటమే శ్రేయోదాయకం. మారుతి మాటలు వినుమన్నా! లంకను మన్ను చేయకుమన్నా! నీతిపరుడుగా మిగులుమన్నా! అన్నా! రావణా! అని వేడుకున్నాడు. 'వినాశకాలే విపరీతబుద్ధి' అన్నట్లు రావణుడు ఆ మాటలను పెడచెవినపెట్టి నాశనమైనాడు.

# జూన్, 2017 రాశిఫలాలు

బ్రహ్మశ్రీ తంగిరాల వేంకటకృష్ణపూర్ణప్రసాద సిద్ధాంతి,
తి.తి.దే. ఆస్థానసిద్ధాంతి, రేలంగి



**మేషం :** తెలివిగా చురుగ్గా చలాకీతనాన్నీప్రదర్శిస్తూ, ధైర్యంతో కార్యజయం సాధిస్తారు. శుభకార్యక్రమాల్లో పాల్గొంటారు. అందరితో సంతోషంగా గడుపుతారు. ధైర్యంగా ముందుచూపుతో నడచి రాజకీయంగా లబ్ధిపొందుతారు. ఇతరులకు మార్గదర్శకంగా నిలుస్తారు. మీ సలహాలు ఇతరులకు ఉపయుక్తంగా ఉంటాయి.



**వృషభం:** వృత్తి వ్యాపారాల్లో మార్పుల సూచన. నూతనవ్యాపారాలను నిర్వహించే అవకాశం గలదు. ఇతరుల సహాయసహకారాలు మీకు లభిస్తాయి. జాయింటువ్యాపారాలు మీకు కలసి వస్తాయి. ఉద్యోగ స్తులకు సామాన్య కాలము. ఆరోగ్యము సామాన్యంగా ఉంటుంది. ఆంజనేయస్తోత్రపారాయణ మంచిది.



**మిథునం:** ఇంట్లో శుభకార్యసందడి. సమయానికి ధనము చేతికి అందడం, అనుకున్న పనులు ఖచ్చి తముగా నెరవేర్చడం, పుణ్య కార్యాల్లో పాల్గొనడం, ఇష్టకార్యసిద్ధి, శరీరం కాంతివంతమగుట, భోగ భాగ్యములనుభవించుట, అర్థలాభము. సంతృప్తిగాయుందురు.



**కర్కాటకం :** విజ్ఞానం సముపార్జన చేయగల్గుతారు. అన్నింటా మీదే పైచేయి అవుతుంది. నూతన కార్య క్రమాలు నిర్వహిస్తారు. దైవబలం పెరుగుతుంది. ధనధాన్యలాభములు సర్వకార్యములయందు జయం కల్గును. శాస్త్రసాంకేతిక పనిముట్లవ్యాపారులు లాభాలు పొందు తారు. లక్ష్యసాధనకోసం శ్రమిస్తారు. కలిసి వస్తుంది. ఋణ విముక్తి కలుగుతుంది.



**సింహం :** రాజకీయ కార్యక్రమాల్లో పాల్గొంటారు. అందరిచే కీర్తించబడతారు. జ్ఞాన సముపార్జన చేస్తారు. ఋణాలు తీరుతాయి. న్యాయపరమైన అంశాలలో ఇతరులకు సూచన చేస్తారు. దూరప్రాంతాల్లో పెద్ద మొత్తంలో భూమి కొనుగోలు అవకాశములు గలవు.



**కన్య:** విద్యావ్యాసంగాల్లో రాణిస్తారు. నాణ్యతను పెంచుకుంటారు. విద్యాభివృద్ధి, క్రొత్తకోర్సులలో ప్రవే శములు, విదేశీప్రయాణములు కలసి వచ్చును. ధనం కోసం చేసే, ప్రయత్నాలు ఫలిస్తాయి. పూర్వపు మిత్రులతో సంబంధ బాంధవ్యాలు మెరుగవుతాయి. చిన్నకారు వర్తకులకు, టైలర్లకు ధనలాభము కలుగును.



**తుల:** కార్యములను ధైర్యముగా సాధించగలరు. వృత్తి వ్యాపారములు అనుకూలము. ఆకస్మిక ధనలాభములు కలుగును. ఇంట్లో శుభకార్య శోభ. గృహమున మంగళతోరణాలు కడతారు.



**వృశ్చికం:** ధనధాన్యాదుల వృద్ధి, బంధుమిత్రుల ఆదరణ, పదిమందిలో మంచి పేరు ప్రతిష్ఠలు కలుగుతాయి. సభలలో వాగ్ధాటి ప్రదర్శించి అందరిని జయించుకుని రాగలరు. వస్త్రలాభము, ధనధాన్య లాభములు. మనోధైర్యముగానుందురు. సాధ్యమైనంత వరకు తక్కువ మాట లాడటం మంచిది.



**ధనుస్సు:** ప్రయత్నించిన కార్యములు సఫలీకృత మగుట, శరీరం సుఖముగా నుండుట, ధనధాన్య వస్త్రాది లాభములు, విశేషవస్తువులను సేకరించుట. అందరికి ఆనందము కల్గించుట, సత్ప్రవర్తన, పెద్ద లను గౌర వించుట మొదలగు మంచి లక్షణములుండును. రచనా వ్యాసంగాలలో రాణిస్తారు. అద్భుతమైన మానసిక శక్తిని ప్రదర్శించి సమస్యలకు పరిష్కారం కనిపెడతారు.



**మకరం:** నెల ప్రారంభములో ధనధాన్యలాభములు, వస్తువస్త్ర సంపదల వృద్ధి. అన్నింటా సౌఖ్యములు. నెలాఖరులో దూరప్రాంత ప్రయాణములు, దేవతా సందర్శనములు కలసి వచ్చును.



**కుంభం:** వనవిహారాలు చేస్తారు. దూరపు బంధువు లకు దగ్గరవుతారు. ధనలాభం కలిగినా ఖర్చు తప్పదు. ఆర్థికపరంగా పటిష్టంగా ఉంటారు. ఆలో చనతో చేసినపనులు ఫలవంతమవుతాయి. వ్యవ సాయరంగాలలో రాణింపు.



**మీనం:** వనవిహారములు చేయుట, దూరప్రాంతాలను దర్శించుట, జలక్రీడలలో పాల్గొనుట, శరీరారోగ్యము, హుషారుగాయుండుట, విద్యావ్యాసంగములలో పాల్గొ నుట, తన ఉద్యోగవిషయములలో జ్ఞానసముపార్జనకు శిక్షణలు పొందుట జరుగును. ఉద్యోగ ఉన్నతికై చేసే ప్రయత్నం త్వరలో నెరవేరబోతోంది.

# తెర తీయగ రాదా!

– విద్వాన్, డా॥ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య

ఎందరో వాగ్గేయకారులు తమ భక్తిసంగీతంలో శ్రీ వేంకటేశ్వరస్వామి వారిని వేనోళ్ల కీర్తించి, తాము తరించడమే కాక, ఆ కీర్తనల్ని భక్తితో గానం చేసినవారిని కూడా తరింపజేస్తున్నారు. కలియుగప్రత్యక్షదైవమై, భక్తుల పాలిటి కల్పవృక్షంగా, ఆపదమ్రొక్కులవాడుగా కీర్తింపబడే శ్రీవేంకటేశ్వరుణ్ణి సేవించని భక్తులుండరు.

కర్ణాటకసంగీతచరిత్రలో త్యాగరాజు చిరస్థాయి అయిన కీర్తిప్రతిష్ఠల్ని గడించాడు. "కర్మభక్తిజ్ఞాన మార్గాలను సంగీతంలో మేళవించి, నిజము నెరిగిన బ్రహ్మవేత్త - త్యాగయ్య".

త్యాగరాజు దేవతాంతరభేదాన్ని పాటించక, అన్ని పుణ్యక్షేత్రాలనూ దర్శించి, ఆయా క్షేత్రాధిదైవతాల్ని నోరార కీర్తించి, సేవించి, వారికృపకు పాత్రుడైన అభేద్య దర్శనసిద్ధుడు.

త్యాగరాజు తన శిష్యుడైన వాలాజాపేట వేంకటరమణ భాగవతులవారి కోరికప్రకారం తీర్థయాత్రలకు బయలుదేరి, మొదటగా వాలాజాపేట మీదుగా శ్రీతిరుపతిక్షేత్రానికీ, ఇటనుండి కోవూరు, కంజీవరం, అటనుండి మధ్యార్జునం, గోవిందపురం, తిరువసినెల్లూరు, నాగపురం, రామేశ్వరం, ధనుష్కోటి, మధుర, శ్రీరంగం – ఇలా సంచారం చేశాడు. అయ్యగారివెంట శిష్యబృందమూ ఉండేది. త్యాగరాజును 'అయ్యగారు' అనడం సంప్రదాయం.

అయ్యగారు తిరుమల శ్రీవారిని సేవించడానికి ఆలయానికి వచ్చిన సమయానికి తిరువారాధనకోసమో, ఆరగింపు సేవకోసమో తెరవేసి ఉంచారు. ఆ తెర స్వామికి గాక తనకే వేసినట్లు లోలోపల భావించి, తన దుష్కృత ఫలమే ఈ తెరరూపంలో అడ్డగించి, స్వామివారిదర్శనభాగ్యాన్ని దూరం చేసిందని నిర్ణయించి, ఆ పరాత్పరుని దివ్యదర్శనంకై ఆర్తిపరుడై, తన మత్సరాన్ని తొలగించుమంటూ భక్తి ప్రపూర్ణహృదయంతో ఇలా ప్రార్థించాడు.

గౌళిపంతు - ఆది

తెర తీయగరాదా లోని  
తిరుపతి వెంకటరమణ! మచ్చరమను ॥ తె॥

పరమపురుష! ధర్మాదిమోక్షముల  
పారఁదోలుచున్నది నాలోని ॥ తె॥

ఇరవొందగ భుజియించు సమయమున  
ఈఁగ తగులు రీతి యున్నది  
హరిధ్యానము సేయు వేళ చిత్తము  
అంత్యజు వాడకుఁ బోయిన ట్లున్నది ॥ తె॥

మత్స్యము ఆకలిఁగొని గాలముచే  
మగ్నమైన రీతి యున్నది  
అచ్చమైన దీపసన్నిధి మరు  
గిడఁ బడి చెఱచిన ట్లున్నది ॥ తె॥

వాగురయని తెలియక మృగగణములు  
వచ్చి తగులు రీతి యున్నది  
వేగమె నీ మతము ననుసరించిన  
త్యాగరాజనుత మదమత్సర మను ॥ తె॥

అయ్యగారు పరమార్తుడై ఈ విధంగా కీర్తించగానే ఆర్తిహరుడైన శ్రీవారికీ, ఆర్తభక్తుడైన త్యాగయ్యకూ మధ్యనున్న తెర తనంత తానే తొలగి పోయింది. అనంతరం శ్రీవారిని కనులారా దర్శించి, మనసారా కీర్తించి, ఆడిపాడి బ్రహ్మానంద పరవశు డయ్యాడు.



మంచి సంకల్పానికి దేవుడే దారి చూపిస్తాడు

శ్రీవారిని దర్శించడానికి తెర అడ్డంగా ఉన్నప్పుడు– భౌతికమైన వస్త్రపుతెరను తొలగించుమంటూ స్వామినీ, అర్చక స్వామినీ అర్థించడంకంటే – తన జన్మాంతరదుష్కృతమో, అరిషడ్వర్గమో ఇందుకు కారణమై ఉంటుం దని నిర్ణయించి, ఆ దోషాలను తన మనస్సుకు తెచ్చుకొని, తాను అపరాధాలకు పుట్టినిల్లనీ, గతిలేనివాణ్ణనీ, సంసారుల దోషాలను కూడా తన యందే ఆరోపించుకొని, వాటిల్నికూడా తన దోషాలుగానే భావించడం అయ్యగారి విశాలదృష్టికీ, అందరిఆర్తినీ తొలగించా లనే ప్రపన్నత్వవిశిష్టతకూ ఈ సన్నివేశం నిదర్శనం. కష్టసుఖాలు రెండూ భగవంతుని కృపాప్రాప్తాలే!

అయ్యగారి ఈ ఆర్తికీర్తన భావసారాంశం."ఓ తిరుపతి వెంకటరమణా! నాలో ఉండే మాత్సర్యమనే తెర – నీ దర్శనా నికి ఆటంకం కల్పిస్తోంది. దీన్ని తొలగించు. ఓ పరమపురుషా! ధర్మ, అర్థ, కామ, మోక్షాలను స్వానుభవానికి రానీకుండా నాలోని ఈ మాత్సర్యమనే తెర – దూరం చేస్తోంది – స్వామీ! స్తిమితంగా భోజనంచేసే సమయంలో నోటిలో ఈగ అడ్డం వచ్చినట్లూ, స్థిరచిత్తంతో శ్రీహరిని ధ్యానించే వేళలో మనస్సు అనాచార, అసభ్య స్థలాలకు వెళ్ళినట్లూ, నీటిలోని చేప ఆకలితో ఆహారం అనుకొని గాలానికి తగులుకొన్నట్లూ, స్వచ్ఛమైన దీపకాంతిలో ఏదో మరుగు ఏర్పడి, కాంతిని చెరచినట్లూ, లేళ్లు తమను పట్టుకోవడానికి వలపన్నిన గొయ్యి అని తెలి యక అందులో పడినట్లూ, ఏ జన్మలోనిదో అయిన మదమా త్సర్యాల తెర నీ దర్శనభాగ్యానికి అడ్డుగా నిల్చి ఉంది. దయతో ఈ తెరను తొలగించి, నీ దివ్యదర్శనభాగ్యాన్ని కల్గించవా?" అని.

అనుకొన్న సమయానికి దైవదర్శనం కాలేదంటే – చాలామంది "నాపై స్వామికి దయలేదు. అందుకే నాకు దర్శనభాగ్యం లభించలేదు" – అంటూ నేరం భగవంతునిపై మోపుతారు. కాని త్యాగయ్యవంటి జ్ఞాన సంపన్నులు అలా భావించరు. భగవంతుడెప్పుడూ కృపామూర్తియే! వారికృపకు నోచుకునే అర్హత మనలోనే ఎక్కడో లోపించి ఉంటుంది. ఆ లోపం తొలగితే స్వామికృప మనపై తప్పక ప్రసరిస్తుంది. జీవుని హృదయాన్ని కామక్రోధలోభమోహమదమాత్సర్యాలనే శత్రువర్గం ఆవరించి, అతణ్ణి సత్ కార్యాలకూ, సద్భావాలకూ దూరం చేస్తుంది. అహంభావానికి మదమాత్సర్యాలే ప్రబల కారణం. 'అహం' తొలగితే అన్ని ఆటంకాలూ తమంత తామే తొలగి పోతాయి. కర్మానుగుణంగా ప్రాప్తించిన ఈ మదమాత్సర్యాలను, కర్మాతీతుడైన వేంకటేశ్వరుడే తొలగించాలి. దైవదర్శనానికి ప్రతిబంధకా లేర్పడితే, ఇతరులు ఎవ్వరూ వాటిల్ని తొలగించ లేరు.

పరమభాగవతులు నిరంతరం భగవద్భావనాచిత్తం కల వారు; తమకు కలిగే అన్ని అనుభవాలనూ భగవంతునియందే సమన్వయించుకొంటారు. అంతేగాని తమప్రారబ్ధాన్ని మరొకరిపై రుద్దరు. త్యాగయ్య పరమభాగవతశిరోమణి! ఈ కీర్తనలో– కామక్రోధాదులైన అరిషడ్వర్గ ప్రభావం ఎంత బలవత్తరమైనదో అయ్యగారు ఎంతో ఆర్తితో ఉపమాన రూపదృష్టాంతాలతో వ్యక్తం చేశారు. అహంకారమమకారాలే సర్వఅనర్థాలకూ మూలం. మమ (నాది), నిర్మమ (నాదికాదు); అనే ఈ రెండే బంధ మోక్షాలకు కారణాలని వేదాంతుల నిర్ణయం. 'అంతా నాదే' అనుకొంటే బంధం. 'ఏదీ నాది కాదు– అంతా ఆ భగ వంతునిదే' అని భావించి, శరణాగతుడై ప్రవర్తిస్తే అదే మోక్ష కారణం! "ఇంతటి గొప్పవాణ్ణి నేను వచ్చాను. నాకు దర్శనా వకాశం లేకుండా ఈ తెర అడ్డం పెట్టారు" అని తమకు తోచిన



వారినందరినీ, తోచినరీతిలో నిందించకుండా – త్యాగయ్య తనలో ఏ మూలనో దాగి ఉన్న అహంకారం ఈ తెరరూపంలో అడ్డగించింది. దాన్ని తొలగించుకోవడానికి నేను అశక్తుణ్ణి. పాపపరిహారకుడూ, సర్వశక్తిసమర్థుడూ అయిన వేంకటేశ్వరుడే ఈ అహంరూపమైన తెరను తొలగిస్తాడు' అని ఆ స్వామినే నిండుభక్తితో, ఆర్తితో ప్రార్థించాడు. ప్రపన్నార్తిహరుడుకదా వేంకటేశ్వరుడు! త్యాగయ్య ఆర్తినీ, ప్రపన్నతాగుణాన్నీ గమనించి, తత్క్షణమే ఆ తెరను తొలగించాడు.

కనుక తీర్థయాత్రలకూ, దైవదర్శనాలకూ చిత్తంలో ఏర్పడే ప్రతిబంధకాలు ఇతరులవల్ల వచ్చేవి కావు. అవి స్వయం కృతాలు. కనుక పశ్చాత్తాపంతో, ఆ ప్రతిబంధాలను తొలగించు కోవడానికి సర్వశరణ్యుడైన శ్రీవేంకటేశ్వరుణ్ణి శరణు పొందాలి. ఆర్తితో, భక్తితో స్వామిని ప్రార్థించాలి.

ఇక్కడ అయ్యగారు "నీ మతము ననుసరించిన" అనే గొప్పమాట అన్నారు. శ్రీవారి మతం–'తన పాదపద్మాలను ఆశ్రయించి, భవబంధాలనుండి తరించండి' అనేది. అందుకే –

విష్ణోః పదే పరమ ఇత్యుదిత ప్రశంసౌ
యౌ మధ్వ ఉత్స ఇతి భోగ్యతయాఽప్యుపాత్తౌ
భూయ స్తథేతి తవపాణితలప్రదిష్టౌ
శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే

పార్థాయ తత్సదృశసారథినా త్వయైవ
యౌ దర్శితౌ స్వచరణౌ శరణం వ్రజేతి ।
భూయోఽపి మహ్యమిహ తౌ కరదర్శితౌ తే
శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే

"భక్తులారా! సకలప్రశస్తాలూ, పరమభోగ్యాలూ అనే విషయాన్ని సార్థకం చేస్తూ నేను కుడిచేతితో క్రిందికి చూపు తున్నవీ, అర్జునునికి అన్ని విధాలా తగినసారథినై ఆనాడు నన్ను శరణుపొందుమని చూపించినవీ, అయిన నా చరణాలను శరణు పొంది సకలబాధలనుండి విముక్తులు కండి" అనేదే శ్రీ స్వామి వారిమతం.

శరణాగతివల్ల అహంకారమమకారాలు నశిస్తాయి. కామ క్రోధాదులు దూరమౌతాయి. వినయవిధేయతలు దగ్గరవుతాయి. అన్ని అనర్థాలకూ కారణం అహంకారం, దాని తోబుట్టువైన అవినయం. అందుకే ఆదిశంకరులు షట్పదీస్తోత్రంలో "అవినయ మపనయ విష్ణో!" – "స్వామీ! నా యందలి అవినయ గుణాన్ని తొలగించు" అని ప్రార్థించినాడు– శ్రీమన్నారాయణుని.

మదం అంటే గర్వం. ఇది 1) విద్యామదం, 2) ధన మదం, 3) కులమదం అని త్రిమదాలుగా కొందరు చెప్పారు. ఇంకా కాస్త లోక స్వభావాన్ని గమనించి మరికొందరు ఎనిమిది విధాల మదాలుంటాయని పేర్కొన్నారు. 1) అన్నమదం 2) అర్థ మదం 3) స్త్రీమదం 4) విద్యామదం 5) కులమదం 6) రూప మదం 7) ఉద్యోగమదం 8) యౌవనమదం – వీటిలో ముందటి విద్యాధనకులమదత్రయమూ ఉన్నాయి. ఇవి కాక మరో అయిదు చేరాయి. వీటిలో ఏ ఒక్కటి ఉన్నా పతనం తప్పదు. ఇక ఎనిమిదీ ఉంటే చెప్పేపనేముంది?

కనుక 'మద' భావం చాలా బలీయమైనది. భగవత్కృపవల్ల, భక్తి జ్ఞానవైరాగ్య సాధనవల్ల, సత్సాంగత్యంవల్ల - 'మదం' - గుణం కోల్పోయి, 'దమం'గా మార్తుంది. దమమంటే బాహ్యేంద్రియనిగ్రహశక్తి.

అయ్యగారు ప్రారంభంలో 'మచ్చరాన్ని' మాత్రం పేర్కొని, చివరలో మదాన్నికూడా చేర్చి "మదమత్సర మను" అంటూ మాత్సర్యానికి మదాన్నీ చేర్చి, బహువచనం చేయక ఏకవచనంగా 'మదమత్సరం' అన్నాడు. మద మత్సరాలు రెండూ ఒక నాణేనికి బొమ్మ బొరుసులాంటివి. అవినాభావ సంబంధం కలవి. మత్సరం అంటే ఈర్ష్య, క్రోధమూ అని అర్థాలు. మదంలో మాత్సర్యం, మాత్సర్యంలో మదం అంతర్లీనమై ఉంటాయి. శబ్దాలూ, అర్థాలూ వేర్వేరుగా కన్పించినా - రెండూ ఏకరూపమే అని అయ్యగారి భావన.

కనుకనే చివరి చరణంలో "మద మత్సరమను తెర తీయగరాదా" అన్నాడు. తెరకు రెండు వైపు లుంటాయి. ఒక వైపున మదం, మరో వైపున మత్సరం, నాల్గు అంచుల్లో కామక్రోధలోభమోహాలు అనే తక్కిన నాల్గూ ఉంటాయి. కనుక జీవునికి భగవద్దర్శనప్రాప్తికి ప్రతిబంధకంగా తనలోని కామక్రోధ లోభమోహమదమాత్సర్యాలనే అంతశ్శత్రురూపమైన 'తెర' అడ్డంగా ఉంటుంది. ఈ అరిషడ్వర్గమనే తెర తొలగితే - బాహ్యమైన వస్త్రపుతెర తొలగినా - తొలగకున్నా మనోనేత్రంతో భగవంతుణ్ణి దర్శింపవచ్చుననే గొప్ప ఆధ్యాత్మిక విశేషాన్ని ఈ కీర్తనలో అయ్యగారు వివరించారు.

అంతశ్శత్రువినాశకుడు అంతర్యామి అయిన వేంకటరమణుడే! అతడే రాముడు-రాముడే వేంకటరమణుడు. కనుక "ఓ తిరుపతి వేంకటరమణా! నాలోని మదమత్సరమనే తెరను తొలగించి, నీ దర్శనభాగ్యం కల్గించు"మని ప్రార్థించినాడు - త్యాగరాజు.

శరణాగతిశ్లోకాల తాత్పర్యాన్ని అయ్యగారు త్రికరణ శుద్ధిగా విశ్వసించినారు. వేంకటరమణుని ప్రపన్నార్తిహరత్వ గుణాన్ని గ్రహించి, తనయందలి దోషాన్ని తొలగించి, రక్షించుమని వేడుకొన్నాడు. ఏడుకొండలవాడు, తెరను తొలగించి, దివ్య దర్శనభాగ్యం కలిగించాడు. 'వేంకట' శబ్దాన్ని స్వామి సార్థకం చేసుకొన్నాడు. ఈ సన్నివేశం ద్వారా - శ్రీవారి దర్శనం, కృప, సంపూర్ణంగా లభించాలంటే - నిరహంకారం, నిర్మలత్వం, నిశ్చలభక్తి, ప్రపత్తీ కావాలనీ, అంతఃకరణశుద్ధి ఉంటేనే పారమార్థిక సుఖశాంతులు సిద్ధిస్తాయనీ - గ్రహించాలి.

**అజ్ఞానినా మయా దోషాన్ అశేషాన్ విహితాన్ హరే!**
**క్షమస్వ త్వం క్షమస్వ త్వం శేషశైల శిఖామణే !!**

**శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే**

# శ్రీమద్రామాయణమ్

**పరిష్కర్త - మహామహోపాధ్యాయ డా॥సముద్రాల లక్ష్మణయ్య**

**(8 సంపుటాలు, వెల- రూ.1900/-లు)**

**తిరుమల తిరుపతి దేవస్థానం ప్రచురణ**

"రామో విగ్రహవాన్ ధర్మః" అన్నట్లు శ్రీరాముడు మూర్తీభవించిన ధర్మంగా కీర్తింపబడినాడు. ధర్మసంస్థాపనమే లక్ష్యంగా ఆవిర్భవించిన శ్రీరాముడు ధర్మోద్ధరణకు ఏ యే లోకోత్తరమైన కార్యాలు ఆచరించాడో రామాయణంలో మనోజ్ఞంగానూ, అతి విపులంగానూ వర్ణించటం జరిగింది. అందు వల్లనే రామాయణ గాథ ఇరువది నాలుగువేల శ్లోకాలకు విస్తరించింది.

వాల్మీకి తర్వాత ఎన్నో భాషలలో పలు రామాయణాలు కావ్యనాటకాది వివిధ ప్రక్రియలలో వెలువడ్డాయి. కాని వాల్మీకి రచనతో సాటియైన రచన ఏది వెలువడలేదని నిస్సంశయంగా చెప్పవచ్చు.

సంస్కృతంలో మూలగ్రంథాలకు ఎంత ప్రాముఖ్యమున్నదో అంతేప్రాముఖ్యం వ్యాఖ్యానాలకు కూడా ఉన్నది. "వ్యాఖ్యానతో విశేష ప్రతిపత్తిః" అన్నట్లు మూలం ద్వారా తెలియని అనేక అంశాలు వ్యాఖ్యానం ద్వారానే తెలుస్తాయి. రామాయణానికి సంస్కృతంలో అనేక వ్యాఖ్యలున్నాయి. ముద్రితాలు, అముద్రితాలైన ఏబది వ్యాఖ్యానాలను పరిశోధకులు గుర్తించారు. అందులో "తత్త్వదీపిక, భూషణం" అనే రెండు వ్యాఖ్యానాలతో గూడా రామాయణాన్ని ప్రచురించటం సమంజసంగా ఉంటుందని తి.తి.దేవస్థానంవారు భావించారు.

విశిష్టాద్వైత సిద్ధాంతం, శరణాగతి మున్నగువిషయాలు ఈ వ్యాఖ్యానంలో అద్భుతంగా ప్రతిపాదింపబడ్డాయి.

ముంబాయ్, చెన్నయ్, గోరఖ్‌పూర్ నగరాలలో పూర్వం ఆయా సంస్థలు ప్రచురించిన ఐదురకాల రామాయణాలను ఈ పరిష్కరణకు ఆధారంగా స్వీకరించడమైనది.

ఇందులో పీఠిక, వ్యాఖ్యానాలలో ఉదాహృతాలైన గ్రంథాల సూచిక, విషయానుక్రమణిక, మూలగ్రంథంతోపాటు రెండు వ్యాఖ్యలు, పాదపీఠికలలో పాఠాంతరాల నిర్దేశం, గ్రంథాంతంలో శ్లోకపాదానుక్రమణిక, వ్యాఖ్యానాలలో ఉదాహరించబడిన ప్రమాణవచనాల ఆకరనిర్దేశంతోకూడిన అకారాద్యనుక్రమణిక–ఈ క్రమంలో సమగ్రంగా రామాయణం పరిష్కృతమైంది. మొత్తం గ్రంథం తెలుగులిపిలోనే ప్రచురించబడింది.

ఇప్పుడు తిరుమలతిరుపతిదేవస్థాన ప్రచురణలలో లభ్యమౌతున్న మొత్తం 8 సంపుటాల (7282 పుటలు) రామాయణం వెల– రూ.1900/-.

– డా॥ కె. రాధారమణ

# శాండిల్య సంహితా

**పరిష్కర్త - శ్రీమాన్ కాండూరి రామాచార్యులు**

**పుటలు - 300 పుటలు,**

**సైజు-1/8 డెమ్మిసైజు, వెల-రూ.250/-,**

**దొరకుచోటు - ఎన్.రంగనాయకమ్మ,**

**ఇ.నెం.7-1-110, రెడ్డి ఎన్‌క్లేవ్, దేవుని ఆల్వాల,**

**హైదరాబాద్-500 010. సెల్ - 97041 68678**

భగవంతుడైన శ్రీమన్నారాయణునిచే పంచరాత్రులలో పంచశ్రోతులకు పంచ సంస్కార ప్రతిపాదకము, అర్థపంచక బోధకము అయిన పంచరాత్రము పలు సంహితలుగా, వ్యాప్తి చెందింది. ధర్మార్థ కామ మోక్ష భక్తి యోగ పంచ ప్రతిపాదకమై, నారద మహర్షి ముఖము నుండి వెలువడిన ఈ సంహిత శాండిల్యోపదేశంగా శాండిల్య సంహితగా ప్రసిద్ధి చెందింది.




శ్రీమన్నారాయణునికి చెందిన భక్తి, జ్ఞానము, యోగము, వైరాగ్యము, తపస్సు అనే పంచవిషయాలను వివరిస్తూ ఆత్మ సంరక్షణము కల్గిస్తున్నది ఈ పంచరాత్రులు. ఈ పంచరాత్రము అనేక విధములుగా చెప్పబడినవి. ఇది సర్వ ప్రమాణ రహస్యము, వేద సమ్మతము. శాండిల్య సంహిత ఈ పాంచరాత్ర సంహితలలో ఒకటి. దీని నామ నిర్దేశము అగ్నిపురాణ, పాద్మసంహితాది గ్రంథాలలో లభిస్తున్నది. దీనిలో ధర్మఖండము, అర్థఖండము, కామఖండము, మోక్ష ఖండము, భక్తిఖండము అను పంచఖండములు ఉన్నాయి.

ఈ సంహితను నారదుని నుండి మహర్షులు విన్నారు. తమోపాహార సారభూతమైన హరిని గురువునందు దర్శించి వారు ధన్యులయ్యారు. దేవతలకు విష్ణువు, నదులకు సాగరము, నక్షత్రాలకు చంద్రుడు ఎట్లో సంహితులలో ఈ శాండిల్య సంహిత అలాంటిదని నారదమహర్షి పేర్కొన్నాడు.

ఈ సంహితలో శ్రీహరి భక్తి ప్రాధాన్యం, వైష్ణవదీక్షా విశేషం, ద్వాదశోర్ధ్వ పుండ్రధారణ, తులసీ విశిష్టత, శ్రీపాద తీర్థము, ఆచార్య ప్రాధాన్యము వంటి విషయాలున్నాయి. ఇవన్నీ మనకు నేడు అత్యంత ఆవశ్యకాలై ఉన్నాయి. వీటిని ఆచరించుట చాలా అవసరం. అయితే ఈ గ్రంథం సంస్కృతంలో ఉంది. పరిష్కర్తలు పీఠికలో ఈ గ్రంథ ప్రాధాన్యాన్ని, అందులోని విషయాన్ని క్లుప్తంగా చెప్పారేగాని, వ్యాఖ్యానం చేయలేదు. మూలగ్రంథాన్ని యథాతథంగా ఇచ్చినందు వల్ల సంస్కృత పండితులకు తప్ప సామాన్యులకు ఈ గ్రంథంలోని అంశాలు బోధపడే అవకాశమే లేదు.

– డా॥ మన్యం నరసింహులు

# ఆదర్శపురుషులు భగవద్రామానుజులు

- డా॥ చక్రవర్తి రంగనాథన్

**భగవద్రామానుజుల వారు కేవలం విశిష్టాద్వైత సిద్ధాంతానుయాయులకు మాత్రమే ఆదర్శపురుషులు కారు. ప్రతి వ్యక్తికి కూడ ఆదర్శపురుషులుగా వెలుగొందుతున్నారనే విషయాన్ని కొన్ని వృత్తాంతాల ద్వారా మనం తెలుసుకోగలం-**

## గురువుల వద్ద మంచి శిష్యుడిగా...

మొదటగా.. గురువు దగ్గర శిష్యుని ప్రవృత్తి ఎలా ఉండాలి అని మనం ఒకరిని పరిశీలిస్తే రామానుజుల బాల్య కాలంలో జరిగిన ఒక సంఘటనను గుర్తుకు తెచ్చుకొందాం.

రామానుజులవారు శ్రీపెరుంబుదూరు నుండి ఉన్నత విద్యకై కాంచీపురానికి వచ్చి, అద్వైతపండితుడైన యాదవ ప్రకాశుని దగ్గర వేదాంతవిద్యను అభ్యసిస్తున్నారు. ఒకానొక సందర్భంలో యాదవప్రకాశునకు తలంటుచు (అభ్యంగనం గావిస్తూ) గురువు నుండి శాస్త్రార్థాలను వింటూ ఉన్నారు. అపుడు ఛాందోగ్యశ్రుతి "తస్య యథా కప్యాసం పుండరీక మేవమక్షిణీ" అని శ్రుతికి యాదవప్రకాశులు పరమాత్మ యొక్క నేత్రములు కోతి పిర్ర వంటి ఎఱ్ఱనైన నేత్రములు అని అపార్థాన్ని చెప్పినపుడు రామానుజుల కన్నుల నుండి వేడియైన అశ్రుధారలు యాదవప్రకాశునికి తొడలపైన చురుక్కు మనగా, ఆయన తలఎత్తి ఏమి రామానుజ! ఎందుకీ శోకం నీకు అని అడుగగా, వెంటనే నిర్మొహ మాటంగా, నిస్సంశయంగా రామానుజువారు గురువుతో ధైర్యంగా స్వామి! మీరిచ్చిన శ్రుత్యర్థం విరుద్ధార్థం గాను, అసహ్యంగాను పరమాత్మ మొక్క నేత్రాలను కించపరచే విధంగా ఉన్నాయి స్వామీ! అందుకే దుఃఖాన్ని తట్టుకోలేక ఏడ్చాను అని అనగా, అపుడు యాదవప్రకాశులు అట్లైతే నీవు ఈ శ్రుతిః సరియైన అర్థం చెప్పమని గదమాయిం చగా – రామానుజుల వారు వెంటనే–

కప్యాస మితి వాక్యస్య వక్ష్యామ్యర్థం శ్రుణు ద్విజ!
గంభీరాంభసి జాతస్య ప్రోద్యద్భానుకరైస్తథా।
సంపుల్ల దళ పద్మస్య సదృశేలోచనే హరేః
తస్యా శ్రుతేర్వేయలో వక్తవ్యః శాస్త్ర విత్తమైః ॥




అని చెప్తూ "స్వామి! పద్మబాంధవుడైన సూర్యుని యొక్క కిరణములనే లోతైన నీటి నుండి బలమైన నాళాన్ని కల దర్శముల వంటి అందమైన నేత్రములు కలవాడు పరమ పురుషుడు" అని అందమైన అర్థాన్ని చెప్పవలసి ఉండగా, తమరు మర్కటపృష్ఠమనే అతి నీచమైన దృష్టాంతాన్ని చెప్పడం వలన చాలా దుఃఖించాను అని ధైర్యంగా, యథా తథంగా తమ భావాన్ని వెలిబుచ్చారు. ఇందులోనే రామా నుజులవారి నిక్కచ్చితత్త్వం, యథార్థాన్ని చెప్పడంలో వారి కున్నా మనోధైర్యం ప్రకటించబడినది.

వేదాంతదేశికులవారు శిష్యలక్షణాన్ని ఇలా తెలియ చేశారు "న్యాసవింశతి" అనే స్తోత్రంలో "సద్బుద్ధిః,సాధుసేవీ, సముచిత చరితః, తత్త్వబోధాభిలాషీ, శుశ్రూషుః, త్యక్తమానః, ప్రణిపతన పరః, ప్రశ్నకాల ప్రతీక్షః" అని రెండు ఈ విశేషణాలు రామానుజులవారి యందు

అన్వయింపబడు తున్నాయి. గురువు అన్యథా బోధిస్తే, సంకోచాన్ని, సిగ్గును, మర్యాదలను విడిచిపెట్టి ధైర్యంగా ఆ విషయాన్ని ఖండిస్తూ, తన వాదనని వినిపించడం. ఇలాగే, గురువుయందు శిష్యునికి ఉండవలసిన నిజమైన లక్షణాలు ఏమని అంటే "శుశ్రూషా మరియు ప్రణిపతన పరత్వం". అంటే సేవ చేయడం, గురువు ఎపుడు ఏది చెప్పినా కూడ శ్రద్ధగా వినడం, గురువును, ఎల్లప్పుడు నమస్కరించడానికి సిద్ధంగా ఉండడం శ్రీరామానుజులవారి చరిత్రలో స్థిరస్థాయిగా నిలిచి పోయే ఒక సంఘటనను జ్ఞప్తికి తెచ్చుకొందాము.

శ్రీరామానుజుల పంచసంస్కార గురువైన పెరియ నంబివారి ఆదేశంమేరకు చరమ శ్లోకార్థ రహస్య జ్ఞానానికై 'గోష్ఠిపూర్ణుల'నే ఆచార్యులని ఆశ్రయించమని చెప్పగా రామానుజులవారు గోష్ఠిపూర్ణులుండే "తిరుక్కోట్టియూర్" అనే దివ్యదేశానికి వెళ్లడం, అచట వారిని చూచి అడగడం, వారు మళ్లీ రా! అని చెప్పడం, తిరిగి రామానుజులు వెళ్ళి రావడం, ఇలా దాదాపు 17 సార్లు ఉడైయవర్చు తిరుక్కోట్టియూర్‌కి తిరగడం జరిగింది. తర్వాత వారి నుండి రహస్యార్థాన్ని తెలుసుకోవడం జరిగినది. ఇక్కడ విశేషమేమంటే– 'మహాపూర్ణులనే' గురువు యొక్క ఆజ్ఞను రామానుజులు శిరసావహించి "తిరుక్కోట్టియూర్"కి వెళ్లడం. వెళ్ళి ఆ గోష్ఠిపూర్ణుల యొక్క ఆజ్ఞను కూడ శిరసావహించి పలుమార్లు చెప్పినట్టు చేయడం. మధ్యలో ఎటువంటి నిరాసక్తి, కోపతాపాలు లేకుండ, గుర్వాజ్ఞను జవదాట కూడదు అనే రామానుజుల ఈ వృత్తాంతం ద్వారా సత్సంకల్పం మనం తెలుసుకోగలం. కనుకనే వేదం కూడ "తద్విద్ధి ప్రణిపాతేన పరి ప్రశ్నేన సేవయా" అని గురువుకు నమస్కరించి, శుశ్రూష చేసి మళ్లీ మళ్లీ ప్రార్థించి, ఆ వేదాంత జ్ఞానాన్ని పొందవలెనని తెలిపినది కదా! అందుకే రామానుజుల వారు గురువు దగ్గర మంచి శిష్యుడిగా వెలు గొందారని మనం ఈ వృత్తాంతముల ద్వారా తెలుసు కొంటున్నాం.



## శిష్యులకు మంచి గురువుగా...

లోకంలో ఒక గురువు దగ్గర మంచి శిష్యుడిగా పేరు గడిస్తే తర్వాత అతను ఒక కాలంలో మంచి గురువుగా ఎదిగి శిష్యులకు ఆదర్శపురుషుడవుతాడు. భగవద్రామానుజులవారు ఐదుమంది ఆచార్యుల అనుగ్రహానికి పాత్రుడై "శిష్యాదిచ్ఛేత్ పరాజయం" అన్న రీతిగా వారి దగ్గర ఆదరాభిమానాలను చూరగొని, తదుపరి జగదాచార్యుడిగా వెలుగొందాడు. దీనికి కారణాలు రెండు. ఒకటి గురువులయందు మంచి శిష్యుడిగా పేరు సంపాదించడం, రెండవది – శిష్యుల యందు వాత్సల్యాన్ని కలిగి మంచి గురువుగా వెలు గొందడం. ఈ రెండింటినీ కూడ మనం రామానుజుల వారి జీవన వృత్తాంతాలలో చూడవచ్చు.

ధనుర్దాసు అనే ఒక మల్లయోధుడు, తన భార్య యైన హేమాంబ యొక్క అందచందాలకు వివశుడై ఎల్లప్పుడూ ఆమె వదనారవిందాన్నే చూస్తూ తన్మయత్వం చెందేవాడు. ఒకానొక సమయంలో శ్రీరంగని చైత్రోత్సవం జరుగుచుండ అందాల రాశియైన హేమాంబ అచటికి వెళ్లడానికి ఇష్టపడగ, ధనుర్దాసు విధిలేక ఆమెతో బాటు నిచుళాపురంనుండి

బయలుదేరగ, మిట్టమధ్యాహ్నం మండుటెండలో, తన భార్య యొక్క అందమైన ముఖం కంది పోవునని తలంచి దనుర్దాసు ఆమెకు గొడుగుపడుతూ, ఆమె సుందరవదనాన్ని ఆస్వాదిస్తూ, అడుగులు తడబడు చుండ వెనుకకు నడచుచుండగ, అచ్చట ఉన్న వాళ్లు అందరూ అతనిని చూచి పరిహాసం చేయగా, కరుణార్ద్ర హృదయులైన యతిరాజులు ఆ సంఘటనకు నొచ్చుకొని, ఆ స్వాములతో "ఇలా చేయడం భావ్యం కాదు? కాంతాదాసు డైన అతనిని శ్రీకాంతదాసుడిని మనం చేయవలసి ఉండగా పరిహసించడం భావ్యం కాదని" చెప్పి– ధనుర్దాసుని తన దగ్గరికి తీసుకొని రమ్మని శిష్యులను పంపించగా, ధనుర్దాసు రామానుజుల దగ్గరికి వచ్చి ప్రణమిల్లగా, రామానుజులు చిరు నవ్వుతో "అయ్యా! నీవెవరు! ఎందుకు నీవు కాంతకు దాసుడై బహిరంగంగా దాస్యవృత్తి చేయుచున్నావ"ని అడుగగా, అందు లకు ధనుర్దాసు "స్వామీ! హేమాంబ అనే నా భార్య యొక్క నేత్రములు చాలా అందంగా ఉంటాయి. పద్మముల వంటి ఆ నేత్రములు కందిపోవునేమోనని నేను ఆవిడకి గొడుగు పట్టాను. ఆవిడ యొక్క నేత్రాలను చూడకుండా నేను ఒక క్షణం కూడ ఉండలేను కనుక నేను అలా చేశాను. ఇదేమైనా తప్పా! స్వామి" అని విన్నవించగా, అందుకు రామా నుజులు ఎంతో సంయమనంతో "ఓ ధనుర్దాసు! నీవు చూస్తున్న నేత్రముల కన్నా కూడా మిన్నయైన, సౌందర్యాతిశయమైన అలౌకికమైన నేత్రములున్నవి. నీవొకసారి ఆ కన్నులను చూడు. తర్వాత నీ భావాన్ని వెలిబుచ్చుమ"ని చెప్పి, రామానుజులు ఆ ధనుర్దాసుని ఆదరంతో సప్తప్రాకార మధ్యలో వేంచేసియున్న శ్రీరంగనాథుని దివ్యమంగళ విగ్రహం ముందు నిలబెట్టగా, ధనుర్దాసు అప్రాకృతమైన, అలౌకికమైన ఆ దివ్యమంగళ విగ్రహాన్ని దర్శించి అచ్చెరువొంది, తన్మయత్వంతో తదేకదృష్టితో చూస్తూ ఆనందపరవశుడై, రంగ నాథుని దివ్యనేత్రముల సౌందర్యానికి ముగ్ధుడై, రామానుజుల వారి పాదాలపై పడి, "స్వామీ! నేనెంత ధన్యుడ్నిణ్ణి. శిష్య వాత్సల్యంతో తమరు నా కళ్ళు తెరిపించారు. నేనింత వరకు అజ్ఞానంలో పడి హేమాంబ కన్నుల సౌందర్యదాసుడై ఉండి నాను. కాని, మీరు నాకు కనువిప్పు కలిగించార"ని చెప్పి వెంటనే తన భార్యను కూడా అచటకి తీసికొని వచ్చి రామా నుజ పదాశ్రయం గావించాడు. హేమాంబా ధనుర్దాసులిరు వురు రామానుజాచార్యుల శిష్యులై ఆనాటి నుండి శ్రీరంగ నాథుని సేవిస్తూ తమ జీవితాన్ని ధన్యం చేసుకొన్నారు. ఇలా శ్రీరామానుజులు శ్రీరంగనాథుని కృపకు ధనుర్దాసును పాత్రులు చేశారు. శిష్యవాత్సల్యంతో శ్రీరామానుజులకు గురువుల యందు ఎంతటి భక్తియో శిష్యులు యందు అంతటి వాత్సల్యం కలదు.

రామానుజులవారి శిష్యులలో అగ్రగణ్యులు శ్రీకూరేశులు వారు. వీరు రామానుజుల కన్నా వయసులో



పెద్దవారు. ''గుణైర్దాన్యముపాగతః'' అన్న రీతిగా రామానుజుల గుణగుణ ములకు దాసులై రామానుజులు వారికి శిష్యరికం చేస్తుండే వారు. సంప్రదాయంలో రామానుజులు పవిత్రస్థానంలో కీర్తింపబడేవారు.

శ్రీకూరేశులువారు మంచి పండితులు. రామానుజుల శ్రీభాష్య రచనలో ప్రధాన భూమికను పోషించినవారు. క్రిమి కంఠచోళుడనే రాజు శైవమతావలంబి. శివుడే పరతత్త్వమని అందరి చేత చెప్పించేవాడు. అతను ఒకనాడు రామానుజులు మరియు అతని శిష్యులైన కూరేశులు విష్ణువే పరతత్త్వమనే భావంతో ఉన్నారని తెలిసి వారిని తన సభకు పిలిపించుకోవాలని భటులను పంపగా, దీనిని తెలిసిన కూరేశులు రామానుజులకు బదులుగా తాను కాషాయ త్రిదండములను ధరించి తానే రామానుజుడని వారిని నమ్మించి సభకేగి, అక్కడ "శివాత్పరతరం నాస్తి, ద్రోణమస్తి తతః పరం" అని అక్కడ వ్రాసి రాజుయొక్క ఆగ్రహానికి గురై తద్వారా కన్నులను పోగొట్టుకొనగా, రామానుజుల వారు ఈ వృత్తాంతాన్ని విని అయ్యో! తన శిష్యుడు తన కొరకు ఎంత బాధను అను భవిస్తున్నాడో అని పరితపించి ఎంతో దయతో కూరేశులను తన సర్వస్వమైన కంచీ వరదరాజస్వామి సన్నిధికి తోడ్కొని, "కూరేశా! స్వామిని స్తోత్రం చేయి, ఆ వరదుడు నీకు తప్పక కన్నులను ప్రసాదించగలడ''ని చెప్పగా, కూరేశులును "నాకు కన్నులు వద్ద''ని పదే పదే చెప్పగా, కావాలనే రామానుజులు పదే పదే కోరగా, 102 శ్లోకములతో వరదరాజస్తవమును మనోహరంగా రచించారు. అందులో అప్రాకృత దివ్యదృష్టిని ప్రసాదించమని కోరారు. బాహ్య నేత్రములు వద్దని కోరారు. తుదకు రామానుజుల ఆజ్ఞమేరకు కూరేశులు వరదరాజస్వామిని ప్రార్థింప భాహ్యనేత్రములను అనుగ్రహింప, ఆ కన్నులతో తనివితీరా వరదరాజస్వామి దివ్యమంగళవిగ్రహాన్ని సందర్శించి పులకాంకితులైన కూరేశులను చూచి శ్రీరామానుజులు పరమానందభరితులై "తన శిష్యునకు కన్నులు తిరిగి వచ్చాయని" ఆనందసాగరంలో మునిగిపోయారు. ఇలా శ్రీరామానుజులు శిష్యుల యందు అమితమైన దయను, వాత్సల్యాన్ని కూడా ప్రదర్శించారనడానికి ఇదొక నిదర్శనం. అందుకేనేమో శ్రీవైష్ణవ సంప్రదాయంలో "శ్రీమతే రామానుజాయ నమః" అని పఠిస్తే రామానుజుల ముందుతరం అంటే గురుపరంపర, అలాగే తర్వాతి తరం అంటే శిష్య పరంపర కూడ తరిస్తుందనే మాట అక్షరసత్యం.

## భర్తృహరి సుభాషితాలు

**భగ్నాశస్య కరండపిండితతనో ర్గ్లానేంద్రియస్య క్షుధా**
**కృత్వాఽఽఖు ర్వివరం స్వయం నిపతితో నక్తం ముఖే భోగినః।**
**తృప్త స్తత్పిశితేన సత్వర మసౌ తేనైవ యాతః పథా**
**స్వస్థాస్తిష్ఠత దైవమేవ హి పరం వృద్ధౌ క్షయే కారణమ్ ॥**

ఒక ఎలుక (పాములవాని ఇంట)
రాత్రివేళ
ఆహారం కోసం అన్వేషిస్తూ
ఒక పెట్టెకు కన్నం వేసి
అందులో దూరింది.
అంతకు ముందే
ఆ పెట్టెలో బంధింపబడివున్న
పాము ఇక వెలుపలికి వెళ్లే
ఆశ లేదనుకొని అక్కడే
చుట్టచుట్టుకొని ఇంద్రియ పాటవం
కోల్పోయి ఆకలితో అలమటిస్తూ ఉండింది.
ఎలుక తనంతతానే పోయి
ఆ పామునోట పడింది.
పాము దాన్ని మ్రింగి ఆకలి తీర్చుకొని
ఆ కన్నం గుండానే చరచరా
వెలుపలికి వెళ్ళింది.
వృద్ధి వినాశాలకు దైవమే కారణం.
కాబట్టి మీరు దైవం మీద భారం వేసి
నెమ్మదిగా ఉండండి!

– *డా॥ సముద్రాల లక్ష్మణయ్య*

# అందరికీ కావలసిన తులసి

- డా॥ జి.వి.పూర్ణచందు

తులసి అంటే సాటి లేనిది, పోలిక లేనిదీ అని అర్థం. భక్తికీ, శక్తికీ తులసి పర్యాయం. ఆరోగ్యానికి అందరికీ కావలసిన సుధాపూర్ణ కలశి తులసి. ఇది పవిత్రఔషధంగా ప్రసిద్ధి.

తులసిమొక్క శ్రీమహావిష్ణువుకు ప్రీతిపాత్రమైంది. నువ్వుల్లో నూనెలాగా, పాలలో వెన్నలాగా, ప్రవాహంలో నీరులాగా, ఇంధనంలో అగ్నిలాగా శ్రీమహావిష్ణువు తులసి మొక్కలో అంతర్గతంగా ఉంటాడని బ్రహ్మోపనిషత్తు చెప్తోంది. చిలుకద్వాదశిరోజు తులసికోటవద్ద కర్ర పాతి ఆకాశదీపం వెలిగిస్తారు. తులసి సాక్షాత్తు లక్ష్మీదేవి అవతారం. ఆ రోజున తులసి, విష్ణువుల కల్యాణం చేస్తారు. బ్రహ్మ, ఇంద్రాది దేవతలతో కలసి శ్రీమహావిష్ణువు, శ్రీలక్ష్మీ బృందావనా నికి వెళ్ళిన రోజును "బృందావని ద్వాదశి" అని కూడా అంటారు. బృందావనం అంటే తులసి తోట! ఒకప్పుడు ఔషధ తయారీ కోసం తులసి తోటలు వేసి పెంచేవారు.

సురస (సారవంతమైన రసం కలిగినది), సులభ (తేలికగానూ, విరివిగానూ దొరికేది), విష్ణువల్లభ (విష్ణు మూర్తికి ఇష్టమైనది), అపేతరాక్షసి (దుష్టశక్తులను దరిచేర నీయనిది), పావని (పవిత్రత నిచ్చేది), శూలఘ్నీ (వ్యాధిని తగ్గించేది) ...ఇలా తులసి అనేకవిధాలా సార్ధకనామధేయి.

తులసి మౌలికంగా ఔషధమొక్క. ఈ తులసిలో ముదురు రంగు ఆకులున్నది కృష్ణ తులసి. లేత రంగులో ఉండేది రామతులసి, నిమ్మతులసి అని కూడా అంటారు. ఎక్కువ ఘాటైన సుగంధం కలిగినది కర్పూర తులసి. ఎక్కువ శక్తి దాయకమైన ఓషధి. విభూది తులసి అని తులసి జాతికే చెందిన మరో ఓషధి ఉంది. దీన్ని భూతులసి, కామకస్తూరి, రుద్రజడ, సబ్జ అని కూడా పిలుస్తారు. దీని గింజల్ని సబ్జా గింజలంటారు. నల్లపూసల మాదిరిగా ఉండే ఈ గింజలు నీళ్ళలో వేస్తే తెల్లగా ఉబ్బుతాయి. ఇవి అమితమైన చలవ చేసే గొప్ప ఔషధ ప్రయోజనాన్ని కలిగి ఉంటాయి.

తులసీ నామాన్ని స్మరించినంత మాత్రానే సర్వ పాపాలు నశిస్తాయని నమ్మకం. "ప్రసీద దేవదేవేశి ప్రసీద హరి వల్లభే / క్షీరోదమాధనోద్భూతే తులసి త్వాం నమామ్యహమ్" అనే మంత్రం చదివి, తులసి మాలను ధరిస్తారు. తులసి కాండాన్ని పూసలుగా చేసి మాలగా అల్లి ధరిస్తారు. తులసి ఆకులు చెవి దగ్గర పెట్టుకుంటారు. స్పర్శా మాత్రంగానే పని చేస్తుందని, శనిగ్రహదోషాలు, ఆయుర్దాయ సమస్యలు, అనారోగ్యాలుపోతాయనీ విశ్వాసం.

ప్రతీ దేవాలయంలోనూ ధ్వజస్తంభంలా, మన ఇళ్ళలో పెరటిభాగంలో తులసికోట ఉంటుంది. బహుశా ఒకప్పటి స్తంభదేవతారాధనకు ఇది మిగిలి ఉన్న సాక్ష్యం కావచ్చు. తులసి మొక్క దగ్గర దీపం పెట్టి పూజించటం ఒక గొప్ప ఆచారం. శ్రీమహావిష్ణువు భక్తితో వేసిన ఒక్క తులసి ఆకుకి తూగి నిలువెత్తు బంగారానికన్నా తులసి మిన్న అని లోకానికి చాటాడు.

మంచి నీళ్లలో తులసి ఆకులు వేస్తే ఆ నీరు తులసి రుచిని పొందుతాయి. ఈతులసితీర్థాన్ని పవిత్రతకు పర్యాయంగా భావిస్తారు. సర్వరోగ నివారిణి. మరణశయ్య మీద ఉన్న రోగికి చివరిసారిగా తులసితీర్థం పోయటం వైద్య ప్రయోజనానికే కాదు, దేహ పవిత్రీకరణకు కూడా! ఏ ఔష ధాన్ని తీసుకున్నా తులసితీర్థంతో వేసుకుంటే ఆ మందు వేగంగానూ, శక్తివంతంగానూ పనిచేస్తుంది. ఇలా ఔషధగుణాలను పెంపొందింప చేసే గుణాన్ని 'యోగవాహి' అంటారు. అది తులసికి ప్రత్యేక లక్షణం. మంచినీళ్ళలో తులసి ఆకులు వేసి అట్టేపెట్టుకుని రోజూ తాగుతూ ఉంటే పుణ్యప్రదమే కాదు, ఆరోగ్యప్రదం కూడా!



కేన్సరు వ్యాధి రాకుండా నివారించే గుణం ఉన్న కొన్ని రసాయనాలు తులసిలో ఉన్నాయి. రేడియేషన్ చికిత్సలో ఆరోగ్యవంతమైన కణాలు దెబ్బతినకుండా తులసి కాపాడుతుంది. కొన్ని రకాల తులసి మొక్కల్లో సుగంధ పరిమళ భరితమైన సువాసనకు అందులో యూజెనాల్, సిట్రాల్, కర్పూరం, థైమాల్‌లాంటి కొన్ని శక్తివంతమైన రసాయనాలు ఉండటమే కారణం. తులసి సూక్ష్మజీవి నాశకం (యాంటిసెప్టిక్) అందుకే!

రోజూ నాలుగైదు తులసి ఆకులు తినేవారికి రక్తంలో షుగరు స్థాయి తగ్గుతుంది. తులసి ఆకుల రసం జలుబు, తలనొప్పి, జీర్ణకోశ వ్యాధులు, వాపులు, గుండె జబ్బుల్లో మేలుచేస్తుంది. చెమట పట్టేలా చేసి జ్వర తీవ్రతను తగ్గిస్తుంది. కంటి వ్యాధులు, కీళ్ళవాతం ఉన్నవారికి మంచి ఔషధం. కామెర్లు, జలోదరం లాంటి వ్యాధుల్లో తులసి ఔషధమే!

నీడన ఎండించిన తులసి ఆకులు, వెన్నులు, రెమ్మల్ని దంచిన పొడి, యాలకులపొడి, మిరియాలపొడి, పుదీనాఆకుల పొడి వీటిని తగుపాళ్ళలో కలిపి ఒక సీసాలో భద్రపరచుకోండి. నీళ్ళలో వేసి మరగ కాచుకుని రోజూ తాగటం ఒక మంచి అలవాటు. కాగిన తరువాత కొద్దిగా నిమ్మరసం కూడా కలుపు కోవచ్చు. కాఫీ, టీ అలవాట్లు మానాలనుకునేవారికి ఇది ప్రత్యామ్నాయ పానీయం. ఇది ఆరోగ్యవంతుల ఆరోగ్యాన్ని కాపాడుతుంది. కీళ్ళవాతం, వాతవ్యాధులు, దగ్గు, జలుబు, ఉబ్బసం, దురదలు, ఎసిడిటీ, అల్సర్లు, టైఫాయిడ్, అమీబియాసిస్‌లాంటి జీర్ణకోశవ్యాధులు తరచూ తిరగబెట్టే వారికి షుగరు రోగులకూ ఈ "తులసి పానీయం" త్రాగే అలవాటు వ్యాధి నివారణకు సహకరించేదిగా ఉంటుంది.





ఫ్లూ, మలేరియా, టైఫాయిడ్ జ్వరాలు తరచూ తిరగబెడ్తున్నప్పుడు కొన్నాళ్ళపాటు తులసిని తీసుకుంటే ఫలితం కనిపిస్తుంది. గొంతులో గరగర తగ్గుతుంది. గాయకులకు, ఉపన్యాసకులకు ఈ 'తులసిపానీయం' మంచి ఉపాయం. మూత్రపిండాల్లో రాళ్లు, ఇతర కిడ్నీ వ్యాధులు, స్థూలకాయం, రక్తంలో కొవ్వు తగ్గటానికి కూడా ఇది ఉపయోగ పడ్తుంది. రక్తదోషాలు తగ్గుతాయి. సైనసైటిస్, మైగ్రేన్ తలనొప్పి నివారిస్తుంది.

తులసి ఆకుల గుజ్జు, సున్నిపిండి కలిపి ముఖానికి నలుగు పెట్టుకుంటే ముఖం మీద నల్లమచ్చలు పోతాయి. ముఖవర్చస్సు పెరుగుతుంది.

భోజనానికి ముందు నాలుగు తులసి ఆకులు, రెండు మిరియం గింజలూ కలిపిమెత్తగా నూరి అన్నంలో మొదటి ముద్దగా కలుపుకుని నెయ్యి వేసుకుని తింటే నాలుకమీద జిగురు తగ్గుతుంది. అన్నహితవు కలుగుతుంది. అన్నం తిన్నాక భుక్తాయాసం కలగకుండా ఉంటుంది.

లవంగం వేసి వండినట్టె, కొన్ని వంటకాల్లో తులసి ఆకుల్ని కూడా వేసి వండుకోవచ్చు. పచ్చివిగా తినే సలాదుల్లో తులసి ఆకుల్ని కూడా చేర్చవచ్చు. తులసి ఆకుల్ని పెరుగు లేదా మజ్జిగలో వేసి తాలింపు పెట్టుకుని తినవచ్చు. బయట ఆహారం తిన్నప్పుడు, ఆహారంలో విషదోషాలు ఉన్నప్పుడు తులసాకులను నమిలితే పొట్ట చెడకుండా ఉంటుంది. తులసిని తీసుకోవటం వలన వార్ధక్య లక్షణాలు తగ్గుతాయి. విషదోషాలను హరించే వాటిని యాంటీ ఆక్సిడెంట్లు అంటారు. ఇవి శరీరంలో కొత్తకణాల ఉత్పత్తిని పెంచుతాయి. తులసి ఈ నిర్మాణాత్మక రసాయన చర్యను పెంపొదిస్తుంది. చర్మం యౌవనంగా ఉండేలా చేస్తుంది. మూత్రంలో వ్యర్థాలను తొలగిస్తుంది. గుండెకు రక్తప్రసరణ పెరుగుతుంది. గుండె శక్తిమంతం అవుతుంది.

ఎండిన తులసి ఆకుల పొడిని ప్రతిరోజూ రాత్రిపూట పళ్ళకు పట్టించి పడుకుంటే పళ్ళకు పట్టిన గార తగ్గుతుంది. చిగుళ్ళు గట్టిపడతాయి. పళ్లలోంచి రక్తం కారడం ఆగుతుంది.

పెరట్లోనిలబడి మన దేహాన్ని, మన ఇంటి ప్రదేశాన్ని, మన మనసుల్నీ పునీతం చేస్తున్న తులసిమాత ప్రశస్తి ఈ తరానికి తెలియాలి! మనం మన మనసుల్ని ఇరుకు చేసుకుంటు న్నట్టే, అపార్ట్‌మెంట్లపేరుతో మన నివాసాల్ని కూడా కుంచింప చేసుకుంటున్నాం. తులసి మొక్కని పూలకుండీలో అయినా పెంచుకోవలసిన అవసరం ఉంది.



# తాళ్లపాక కవులు - సాహిత్యేతర కైంకర్యాలు

- ఆచార్య గార్లపాటి దామోదరనాయుడు

తాళ్లపాక కవులనగానే సహజంగా గుర్తుకొచ్చేది వాళ్ల సంకీర్తనలు. ఆపైన వారి ఇతర కృతులు. సహజంగా సాహితీ లోకానికి ఈ పరిచయమే ఉంది. అయితే తాళ్లపాక అన్నమయ్య మొదలు నాలుగుతరాలవాళ్లు సాహిత్యంతో పాటు స్వామివారికి, స్వామివారికి సంబంధించిన ఇతర ఆలయాలకు అనేక కైంకర్యాలు సమర్పించి ఉన్నారు. ఈ విషయాలు వారే వేయించిన శాసనాలద్వారా విదిత మౌతుంది.

సహజంగా శాసనమంటే చెరిగిపోని విధంగా, శాశ్వతంగా నిలిచి ఉండే పదార్థంమీద చెక్కబడ్డరాత. భారత దేశంలో శిలలు, ఫలకాలు, మృణ్మయపాతాలు, ఇటుకలు, ఏనుగుదంతాలతో చేసిన శాసనాలు కన్పిస్తాయి. తాళ్లపాక కవులకు ముందు దానశాసనాలు, దానపత్రాలు రాసిన కవులూ ఉన్నారు. అయితే దానకైంకర్యాలు చేసిన కవులు కన్పించారు. తాళ్లపాకవారికి సమకాలీనులైన అల్లసాని పెద్దన కోకట గ్రామాన్ని ఈశ్వరాలయానికి దానం చేసినట్టు శాసనముంది. తర్వాత తాళ్లపాకవారు అనేక కైంకర్యాలు చేసినట్లుగా శాసనాలు కన్పిస్తాయి.

తాళ్లపాకవారివిగా తమిళ, తెలుగు, కన్నడ భాషల్లో యాభై ఒక్క శాసనాలు కన్పిస్తున్నాయి. అందులో పెదతిరుమలాచార్యునివే ఎక్కువ. ప్రాంతంవారీగా చూస్తే చిత్తూరు జిల్లాలోనే ఎక్కువ కన్పిస్తాయి. ప్రత్యేకించి అన్నమయ్యవి మాత్రమే కన్పించవు. శాసనాలలో పెదతిరుమలయ్య, అన్నమయ్య, చినతిరుమలయ్య, కోనేటి తిరువేంగళనాథుడు (తాళ్లపాక అన్నమయ్య మనుమడు)వే కన్పిస్తాయి.

**మే, 11 అన్నమయ్య జయంతి సందర్భంగా**

పెద్దతిరుమలయ్య సాహిత్యపరంగా, రాజకీయంగా, సామాజికంగా ఎలాంటి ప్రసిద్ధుడో అతని శాసనాలద్వారా స్పష్టంగా తెలుస్తోంది. ఇతడు తాళ్లపాకవారి సాహిత్యాన్ని రాగిరేకులలో భద్రపరచడమేగాక ఇటు ఆంధ్రాలోనూ, అటు తమిళ, కర్ణాటక దేశాల్లోనూ వివిధ ఆలయాలకు వివిధ కైంకర్యాలు చేసినట్లు చరిత్ర. ఇతనివే ముప్ఫైమూడు శాసనాలు.

ముందుగా మనం అన్నమయ్య చేసిన కైంకర్యాలను చూస్తే ప్రధానంగా పేర్కొనదగింది కల్యాణోత్సవ కైంకర్యం!

**శ్రీలలరంగ మంగమను శ్రీహరి కెన్నడుధారవోయుచో**
**తాళులపాకయన్నమయ తాగడిగెంపదముల్ ధరిత్రి మా**
**తాళులపాక చిన్నన్న పదంబులు పాడిననాడె సర్వరాట్**
**శైలవిభుండు తత్పదరజంబును మాకునొసంగఁ జెల్లదే!**

తాళ్లపాక అన్నమాచార్యుని దౌహిత్రుడు శ్రీపాదరేణు మాహాత్మ్యం, శకుంతలా పరిణయం మొ॥ గ్రంథాల కృతికర్త అయిన రేవణూరి వేంకటాచార్యులు శ్రీ స్వామివారి వివాహోత్సవ విషయాన్ని ధ్రువీకరిస్తూ పై విధంగా ప్రస్తావించాడు. అతడే శకుంతలాపరిణయంలో **"అమ్మహాదేవుండు మదీయమాతా మహవంశ శిఖారత్నంబగు అన్నమాచార్యునకు జామాతురుండనిపించుకుని భవదీయ సంకీర్తనంబు లాలించిన కర్ణంబుల ఇతర సంకీర్తనంబులాలించ నని ప్రతిజ్ఞ గావించె".** కల్యాణోత్సవం చేయిస్తున్న మాన్యుడే కన్యాదాతగా ఉండాలని ఆగమశాస్త్రం చెబుతోంది.

ఆ కారణంచేతనే కాబోలు స్వామివారి తిరుకల్యాణోత్సవాన్ని ప్రారంభించిన తాళ్లపాకవారికి శ్రీ వేంకటేశ్వర స్వామి అల్లుడైనాడు.

తిరుమల కొండమీద కల్యాణోత్సవాన్ని ప్రారంభించినవారు తాళ్లపాకవారే! తిరుమలలో ఇంత ఘనంగా ఈ కల్యాణోత్సవం జరగడానికి కారకులు, ప్రేరకులు అన్నమయ్యే! ఈ ప్రేరణ కారణంగానే ఆ తర్వాత తిరుమలేతర దేవాలయాల్లో కూడా కల్యాణోత్సవాలు నిర్వహింపబడుతున్నాయి. దేవాలయాలల్లో జరిగే సంవత్సరోత్సవాలను ద్రవిడదేశంలో బ్రహ్మోత్సవాలని, తెలుగుదేశంలో కల్యాణోత్సవాలని అంటున్నారు. ఆలయంలో స్వామివారి ప్రతిష్ఠ జరిగిన రోజును దృష్టిలో పెట్టుకుని తిరిగి సంవత్సరానికి ఉత్సవాన్ని నిర్వహించడం ఆనవాయితీ!

చైత్ర ఫాల్గుణ మాసాలలో తిరుమలమీద కల్యాణోత్సవాలు జరిగినట్లుగా శాసనాలున్నాయి. 1547 నాటి 5-99 శాసనం, 1554 నాటి 5-71 శాసనం ఇందుకు తార్కాణం. ఈ కల్యాణోత్సవాన్ని గురించిన ప్రశంసలు కూడా శాసనాలలో నిక్షిప్తమైవున్నాయి. ఆ రోజుల్లో కల్యాణోత్సవం బ్రహ్మోత్సవాలలో ఐదవరోజు జరిగేదని, ఆరవరోజు వసంతోత్సవం జరిగేదని శాసనాలు 2-83, 2-127 వల్ల తెలుస్తోంది.

ఆ తర్వాతికాలంలో ఈ కల్యాణోత్సవం బ్రహ్మోత్సవాల నుండి విడివడి ప్రత్యేక ఉత్సవమైంది.

## పెదతిరుమలాచార్యులు

పెదతిరుమలాచార్యులు క్రీ.శ. 30-11-1517న 1500 నర్పణాలు శ్రీ వేంకటేశ్వరస్వామికి నిత్య ఉభయంగా (అన్నప్రసాదం) ఏర్పాటు చేసినట్లు శాసనం ద్వారా తెలుస్తోంది.

అటుతర్వాత 13 సంవత్సరాలు 31-10-1530న తిరుమల ధ్రువ, ఉత్సవమూర్తుల వివిధ సేవల నిమిత్తం రాయలపాడు, సోమయాజులపల్లె, కట్టంవారిపల్లె, తిప్పనపల్లె, ఎర్రగుంటాయపల్లెలో సగం గ్రామంనుండి వచ్చే ఆదాయాన్ని దేవాలయ భండాగారంలో జమచేసి మూలమూర్తికి నాలుగు ప్రసాదాలు సమర్పించేటట్లు శాసనం చేశారు.

ఇతడు వేసిన ఈ ప్రసాదశాసనం ఆధారంగా ఆ కాలంలో తిరుమలలో సంవత్సరానికి తొమ్మిది బ్రహ్మోత్సవాలు జరిగేవని తెలుస్తోంది.

అచ్యుతదేవరాయలు ఇచ్చిన పూండి, సంగమకోట్టై గ్రామాలను పెదతిరుమలయ్య 27-03-1532 నాడు తిరుమలస్వామికి సమర్పించారు. ఈ గ్రామాలనుండీ వచ్చే ఆదాయంతో మూలమూర్తికి నిత్యనైవేద్యం, ప్రతి శుక్రవారం పునుగు తైలాభిషేకం, సమర్పించేటట్లుగా కట్టడి చేయబడింది.

అంతేగాక అదే సంవత్సరం పెదతిరుమలాచార్యులు అచ్యుతదేవరాయల ఆదేశంతో కోనేరును పునర్నిర్మించారు. మండపనిర్మాణం గావించారు. ప్రాకారపుగోడల ఎత్తును కూడా పెంచారు.

తన సొంతధనంతో పెదతిరుమలయ్య స్వామివారి పుష్కరిణిని బాగు చేయించి ఆ పుష్కరిణికి నాలుగువైపులా మెట్లు నిర్మించాడు. పుష్కరిణిమధ్య భాగంలో నీరాళిమంటపాన్ని నిర్మించాడు. వరాహస్వామి దేవాలయ ప్రదక్షిణ మంటపానికి ప్రాకారగోడల్ని నిర్మించాడు. శ్రీ వేంకటేశ్వరుని దేవాలయ తూర్పు గోపురాన్ని నిర్మించాడు.

25-10-1537 సం॥లో పెదతిరుమలయ్యకు దానంగా మరువాకర్రై, కావనూరు గ్రామాలు సంక్రమించాయి. ఈ గ్రామాలనుండి సంవత్సరానికి 200 బంగారు నాణెలు ఆదాయం లభించేది. దీనిద్వారా స్వామివారికి నిత్యం ఒక పడి కలకండ, ఒక వ్యంజనం సమర్పించేవారు. కార్తికమాసంలో శ్రీ వైష్ణవులకు వనభోజనోత్సవం కూడా ఈ ఆదాయంలోనే జరిగేది. 15-01-1539 నాడు బుక్కరాజు తిమ్మరాజు దగ్గరనుండి వల్లిపురం అనే గ్రామాన్ని పెదతిరుమలయ్య కొన్నాడు. ఈ గ్రామం నుండీవచ్చే 133 బంగారు నాణేల ఆదాయంతో శ్రీ స్వామివారికి నిత్య ఉభయంగా ఒక గోధుమ తిరుప్పణ్ణారం నైవేద్యంగా సమర్పించేవారు. అట్లే 17-03-1539న తమిళమాసమైన ఆని నెలలో ఒకబ్రహ్మోత్సవాన్ని ప్రారంభించారు. దాని నిర్వహణకోసం 2000 బంగారు నాణెలు కట్టడి చేశారు. ఇది 13 రోజుల ఉత్సవం. శ్రవణానక్షత్రం రోజున అంకురార్పణతో ప్రారంభమై మృగశిర నక్షత్రంతో ఈ ఉత్సవం పరిసమాప్తి అవుతుంది. ఈ ఉత్సవంతో కలిపి సంవత్సరానికి పది బ్రహ్మోత్సవాలు జరుపుతున్నట్లు లెక్క!

12-02-1541లో స్వామివారికి పెదతిరుమలయ్య తనకు లభించిన కుప్పం, కీలగుండ్రం అనే గ్రామాలను దానంగా ఇచ్చేశాడు. ఇందులోవచ్చే ఆదాయంతో ఆలయాలకు దగ్గరగా వుండే కాలువలు, చెఱువులు పునర్నిర్మాణం చేయించారు. అట్లే తాళ్లపాక భండారంవద్ద సంవత్సరం పొడవునా దీపం వెలిగించడానికి కట్టడి చేశారు.

19-03-1544 సం॥ పెదతిరుమలయ్య తిరుపతి ఆళ్వార్ తీర్థం (కపిలతీర్థం) లో నమ్మాళ్వార్ అధ్యయనోత్సవ నిర్వహణకు 1020 నర్పణాలను ఆలయభండారంలో సమర్పించాడు. 03-07-1545 సం॥ స్వామివారి నిత్య కైంకర్యానికిగాను 120 బంగారునాణెలను మూలధనంగా సమర్పించాడు. ఈ మూలధనంతో స్వామివారికి నిత్యం ఆరువెళ్ళ్ తిరుప్పొణకం (ప్రసాదం) తళిగెను సమర్పించేవారు. అలమేలుమంగా నాచ్చియార్‌తో కూడిన శ్రీ వేంకటేశ్వర స్వామికి 66 రోజుల పునుగు తైలాభిషేకానికి తిరుమజ్జనోత్స వానికి మూడు రేకుల బంగారం కేటాయించబడింది. అంటే యాభైమూడు శుక్రవారాలకు యాభైమూడు తిరుమంజనం, పదమూడు మృగశీర్షా నక్షత్రాలకు పదమూడు తిరుమంజనం సమర్పించేవారు. ఈ సందర్భంలో ఆచార్యులు కీర్తనలను ఆలపిస్తూ పసుపుపొడి సరఫరా చేసే ఇద్దరికి సంవత్సరానికి పదహారు రేకుల బంగారు, ఎనిమిది పణాలు కట్టడి చేయబడ్డాయి.

అట్లే శ్రీభాష్యం చదివే శ్రీ వైష్ణవులను సంవత్సరానికి నిర్ణీతధనం కేటాయింపు జరిగింది.

సదాశివరాయలు రాజైన తర్వాత పెదతిరుమలయ్య అభ్యర్థనను తన పరిపాలనాధికారి అయిన అళియరామ రాజుకు అప్పగించారు. ముత్యాలపట్టు అనే గ్రామం వారి అధీనంలోకి వచ్చింది. ఆ గ్రామంయొక్క సంవత్సరాదాయం నూరు బంగారు నాణెలు. ఆ నాణెలకు తోడుగా పెదతిరుమలాచార్యులు 36 బంగారు నాణెలు కలిపి ఆరోజే ఆయన శిష్యుడైన శ్రీపతి తొన్నడయ్యన్, డెబ్బై బంగారు నాణేలు ఇచ్చాడు. ఈ మొత్తం మూలధనంగా పెద తిరుమలయ్య పేరుమీద నిర్ణీతరోజులలో ఉభయాలు నిర్వ హించబడేవి.

## యాత్రికులకు సూచనలు

**1)** తిరుమలకు వచ్చే యాత్రికులు ఎలాంటి మత్తుపదార్థాలు, మద్యం, మాంసము, సిగరెట్లు వంటి చెడుపదార్థాలు తీసు కోకూడదు. ఇవి పూర్తిగా నిషేధం.

**2)** యాత్రికులు దర్శన టిక్కెట్లు మరియు వసతి సదుపాయాల్ని తి.తి.దే. నియమనిబంధనల ప్రకారమే తీసుకోవాలి. దళారీలను కానీ, మధ్యవర్తులను కానీ ఆశ్రయించకూడదు.

**3)** యాత్రికులు ఉద్యోగులకు ఎలాంటి బహుమతులు, పారి తోషికాలు ఇవ్వకూడదు. ఇందువల్ల ఉద్యోగుల నైతిక విలువ లకు భంగం కలుగుతుంది మరియు ఉద్యోగులు తమ ఉద్యోగాలను కోల్పోవుటకు సహకరించినవారౌతారు.

**4)** యాత్రికులు గది తీసుకున్న 24 గం॥ల లోపు ఖాళీ చేయాలి.

**5)** తిరుమలకు వచ్చే యాత్రికులు స్వామి దర్శనానికై సరియైన వస్త్రధారణ కలిగి ఉండాలి, ముఖ్యంగా సుప్రభాతం, తోమాల, కల్యాణోత్సవం మొదలైన ఆర్జిత సేవలకు సంప్ర దాయ దుస్తులలో రావాలి. స్త్రీలు-చీర మరియు సల్వార్ కమీజ్‌లలో, పురుషులు-ధోవతి, పైజామాలలో మాత్రమే రావాలి.

**6)** తిరుమలకు వచ్చే యాత్రికులు ముఖ్యంగా ఆర్జిత సేవలు, వి.ఐ.పి. దర్శనానికి వచ్చువారు తప్పనిసరిగా ఐ.డి. ప్రూఫ్ తీసుకురావాలి లేనిచో వారిని ఆయా సేవలకు అనుమతిం చరు.

**7)** భక్తులు తమ కానుకలను శ్రీవారి హుండీలోనే సమర్పించాలి.

**8)** స్వామివారి దర్శనానికి వచ్చే యాత్రికులు మొబైల్ ఫోన్లు, కెమెరాలు వంటి ఎలక్ట్రానిక్ పరికరాలను తీసుకొని ఆల యంలోకి రాకూడదు. వాటిని లగేజికౌంటర్లలోనే వదలి రావాలి.

**9)** యాత్రికులు మరిన్ని వివరాలకు, సలహాలకు, సూచనలకు, ఫిర్యాదులకు తి.తి.దే. విచారణ కార్యాలయంలో సంప్ర దించగలరు.

**తి.తి.దే. కాల్ సెంటర్ : 0877- 2277777**
**టోల్‌ఫ్రీ నెం. : 18004254141**



# శ్రీరామదూతం శిరసా నమామి

– డా॥ అద్దంకి శ్రీనివాస్

మే, 21
హనుమజ్జయంతి
సందర్భంగా...

ఆంజనేయం మహావీరం బ్రహ్మ విష్ణు శివాత్మకమ్।
తరుణార్క ప్రభాం శాన్తం రామదూతం నమామ్యహమ్॥

హనుమంతుడి పేరు చెప్పగానే ఆబాలగోపాలానికీ ఎంతో భక్తిప్రపత్తులు. కొండంత ధైర్యం. శ్రీరాముడు కష్టంలో ఉన్నప్పుడు అండదండలు అందించి, సుందరకాండకు తానే నాయకుడై ఆ కాండను సౌందర్యభరితం చేసిన హనుమంతుడికి ఎన్నోపేర్లు. హనుమానుడు, పవనసుతుడు, ఆంజనేయుడు, కపివీరుడు ఇలా ఎన్నో. ఎన్ని పేర్లు ఉన్నా శ్రీరాముడికి బంటుగా మాత్రమే ఉండడా నికి ఇష్టపడే దాసాంజనేయస్వామి రామసేవాతత్పరులలో మిన్న. అందుకే పంచవిధభక్తులలో దాస్యభక్తికి నిలువెత్తు నిదర్శనం అయ్యాడు ఆంజనేయుడు. హనుమంతుడు ధైర్యానికి మారుపేరు. ఎలాంటి కష్ట సమయంలో అయినా ఆంజనేయుణ్ణి తలచుకుంటే చాలు. కొండంత అండగా ఉంటాడు. ఆఖరికి దెయ్యాలు, భూతాలు లాంటి భయాలు, భ్రమలూ హనుమంతుడి నామస్మరణతో పటాపంచలై పోతాయి. హనుమంతుడి గుడి లేని ప్రాంతం ఉండదు. పిల్లలు, పెద్దలు, ఆడ, మగ అనే బేధం లేకుండా హనుమంతుణ్ణి పూజిస్తారు. విద్యార్థులకు బుద్ధి, శక్తి ప్రసాదించే దైవం ఆంజనేయుడు. ఆంజనేయుణ్ణి స్మరిస్తే మనకు ఏ చింతలూ, సమస్యలూ ఉండవు.

## అసాధ్యసాధక స్వామి

అసాధ్యసాధక స్వామిన్ అసాధ్యం తవ కిం వద ।
రామదూతః దయాసింధో మమకార్యం సాధయ ప్రభో ॥

అసాధ్యాలను సైతం కరతలామలకం చేసే కార్య సాధకుడు హనుమంతుడు. లంకలో సీతమ్మవారి జాడ తెలియక తాను పరితపిస్తున్నప్పుడు–

నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ
దేవ్యైచ తస్యై జనకాత్మజాయై ।
నమోఽస్తు రుద్రేంద్ర యమానిలేభ్యో
నమోఽస్తు చంద్రార్క మరుద్గణేభ్యః ॥

అని ప్రార్థించి తనను తానే ప్రోత్సహించుకున్నాడు. ఎంతటి కార్యసాధకుడికైనా దైవానుగ్రహం ఉండాలని నిరూపించాడు. అందుకే – అసాధ్యసాధకస్వామి! నీకు అసాధ్యం ఏముంటుంది? కాబట్టి నా కార్యాన్ని సాధించి పెట్టుస్వామీ అని కార్యారంభంలో హనుమంతుణ్ణి వేడుకోవాలి.

## పంచముఖ ఆంజనేయస్వామి

వందే వానర నారసింహ ఖగరాట్ క్రోడాశ్వవక్త్రాన్వితం
నానాలంకరణం త్రిపంచనయనం దేదీప్యమానం రుచా।
హస్తాబ్జైరసి ఖేట పుస్తక సుధాకుంభాంకుశాద్రీన్ హలం
ఖట్వాంగం ఫణి భూరుహం దశభుజం సర్వారిగర్వాపహమ్ ॥

వానర, నారసింహ, గరుడ, సూకర (వరాహం), అశ్వ అనే అయిదు ముఖాలతో, అనేక అలంకారాలతో, దివ్య కాంతితో, దేదీప్యమానమైన 15 నేత్రాలతో ఒప్పుతూ ఖడ్గం, డాలు, పుస్తకం, అమృత కలశం, అంకుశం, పర్వతం, నాగలి, ఖట్వాంగం, ఫణి, భూరుహం ధరించిన వాడు, సర్వశత్రుగర్వాన్ని హరించిన హనుమంతునికి నమస్కారం. అంటూ భూత, ప్రేత, పిశాచబాధలు ఉన్నవారు అనారోగ్యపీడితులు ప్రార్థిస్తే వాళ్ళ సమస్తబాధలూ తొలగి పోతాయి. అంతేకాదు –



ఓర్పును మించిన - తపస్సు లేదు

హనూమా నంజనాసూనుః వాయుపుత్రో మహాబలః,
రామేష్టః ఫల్గుణః సఖః పింగాక్షో అమితవిక్రమః.
ఉధధిక్రమణశ్చైవ సీతాశోక వినాశనః,
లక్ష్మణ ప్రాణదాతా చ దశగ్రీవస్య దర్పహా.
ద్వాదశైతాని నామాని కపీంద్రస్య మహాత్మనః
స్వాపకాలే పఠేన్నిత్యం యాత్రాకాలే విశేషతః
తస్య మృత్యు భయం నాస్తి సర్వత్ర విజయీభవేత్.

– అని ద్వాదశనామాలనూ, అలాగే

బుద్ధి ర్బలం యశోధైర్యం నిర్భయత్వమరోగతా ।
అజాడ్యం వాక్పటుత్వం చ హనూమత్ స్మరణాత్ భవేత్ ॥

అనే శ్లోకాన్ని పఠిస్తే సర్వఅరిష్టాలూ తొలగిపోయి బుద్ధి, బలం, యశస్సు, ధైర్యం, నిర్భయత, ఆరోగ్యం, చురుకుదనం, వాక్పటుత్వం సిద్ధిస్తాయి. రామాయణంలో హనుమంతుడు తన ఆచరణ ద్వారా వీటన్నింటినీ ప్రదర్శించాడు.

## జై భజరంగ భళీ

ఆంజనేయుడు శత్రుభయంకరుడు.

గోష్పదీకృత వారాశిం మశకీకృత రాక్షసమ్ ।
రామాయణ మహామాలా రత్నం వందే అనిలాత్మజమ్ ।

ఆవు కాలిగిట్టకింద ఉన్నట్లుగా సముద్రాన్ని తన కాలికింద ఉండేటట్టు చేసినవాడూ, రాక్షసులను దోమల్లాగా చంపినవాడూ, రామాయణం అనే మాలలో రత్నం అయిన వాడూ హనుమంతుడే. వినయం, వివేకం, విజ్ఞత, వీత రాగం, విద్య, విశ్వసనీయత ఉన్నవాడికే విజయం లభిస్తుందని హనుమంతుడు నిరూపించాడు. ఈ గుణాలన్నీ ఉన్న మహానుభావుడు.

ఉల్లంఘ్య సింధోః స్సలిలం సలీలం
యశ్శోక వహ్నిం జనకాత్మజాయాః ।
ఆదాయ తేనైవ దదాహ లంకాం
నమామి తం ప్రాంజలి రాంజనేయం ॥

లీలగా సముద్రాన్ని లంఘించి, సీత శోకాగ్నిని తెచ్చి లంకను దహించిన హనుమంతునికి నమస్కరిస్తున్నాను. అని ఒక కవి చమత్కరించాడు. ఆంజనేయుడు ఉత్తమ సేవకుడు. రామవాక్యపాలనే ఆంజనేయుడి పరమ కర్తవ్యం. ఉత్తమ ఆచార్యుడు, యోగవిద్యాసాధకుడు. ఒక్క మాటలో చెప్పాలంటే అన్నింటా నేర్పరి హనుమంతుడు.

అన్నిటా నేరుపరి హనుమంతుడు
పిన్ననాడే రవినంటె పెద్ద హనుమంతుడు

ముట్టిన ప్రతాపపు రాముని సేనలోన
అట్టె బిరుదు బంటు హనుమంతుడు
చుట్టిరానుండినట్టి సుగ్రీవు ప్రధానులలో
గట్టియైనలావరి చొక్కపు హనుమంతుడు

వదలక కూడినట్టి వనచర బలములో
నదె యేకాంగ వీరుడు హనుమంతుడు
చెదరక కుంభకర్ణు చేతి శూల మందరిలో
సదరాన విరిచె భీషణ హనుమంతుడు

త్రిజగముల లోపల దేవతా సంఘములోన
అజుని పట్టాన నిలిచె హనుమంతుడు
విజయనగరాన శ్రీ వేంకటేశు సేవకుడై
భుజబలుడై యున్నాడిపుడు హనుమంతుడు - అని అన్నమయ్య కీర్తనే ఒక ఉదాహరణ.

దేనికీ నిరాశ చెందకూడదు. నిరంతరం శ్రమించాలి. స్వామికార్యం కోసం సర్వస్వమూ ధారపోయాలి. అవకాశాలు మూసుకుపోయినప్పుడు ఇంకా తెలివిగా దైవభక్తితో కృషి చేయాలి, అహంకారం పనికిరాదు. సంకల్ప బలం ఉండాలి. మనో వికారాలు అణచుకోవాలి. మనోనిశ్చలత్వం, నిస్వార్థకర్మ కార్యసాధకుడికి అత్యంత అవసరం అని హనుమంతుడు మనకు సందేశం అందిస్తున్నాడు. ఎక్కడ రామనామం వినిపిస్తుందో అక్కడ హనుమంతుడు భక్తి తన్మయుడై నిలిచి ఉంటాడు. కలియుగంలో సత్వరం ఫలితాలు పొందాలంటే అందరికీ ఆశ్రయించదగ్గ సర్వ దేవతా స్వరూపుడు అభయాంజనేయస్వామి.

యత్ర యత్ర రఘునాథ కీర్తనం
తత్ర తత్ర కృతమస్త కాంజలిమ్ ।
భాష్పవారి పరిపూర్ణ లోచనం
మారుతిం నమత రాక్షసాంతకమ్ ॥

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# సప్తగిరి

(ఆధ్యాత్మిక మాసపత్రిక)



## చందా నమోదు పత్రం

**1.** పేరు మరియు చిరునామా :

(విడి విడి అక్షరాలలో అర్థమయ్యేలా వ్రాయండి & పిన్‌కోడ్ తప్పక వ్రాయండి)

____________________

____________________

____________________

____________________ (పిన్‌కోడ్ తప్పని సరి) | | | | | | |

సెల్ నెం. | | | | | | | | | | | |

**2.** కావలసిన భాష :

☐ తెలుగు ☐ తమిళం ☐ కన్నడం

☐ హిందీ ☐ ఇంగ్లీషు ☐ సంస్కృతం (సంవత్సరచందా మాత్రమే)

**3.** సంవత్సర/జీవిత చందా :

☐ రూ.60/- ☐ రూ.500/-

**4.** చందా పునరుద్ధరణ :

(అ) చందా నెంబరు :

(ఆ) భాష :

**5.** చెల్లించిన మొత్తం :

డి.డి.నెం. :

తేది :

(చెక్కులు స్వీకరించబడవు)

ప్రదేశం :

తేది : చందాదారుని సంతకం

1) సప్తగిరి సంవత్సర చందా రూ.60/-, జీవితచందా రూ.500/-లు; డి.డి. / ఎం.ఓ.ను 'చీఫ్ ఎడిటర్, 'సప్తగిరి', తి.తి.దే., తిరుపతి' వారిపేరున తీయాలి.

2) సప్తగిరిచందాదారులుగా చేరదలచుకొన్నవారు/ తమచందాను పునరుద్ధరించుకోదలచినవారు ఈ కూపనులో గానీ లేక తెల్లకాగితంలోగానీ పైన పేర్కొన్నవిధంగా వివరాలు వ్రాసి, పంపవచ్చు. క్రింద ప్రచురించిన చిరునామాను మాత్రమే సంప్రదించండి. తి.తి.దే. ప్రధానసంపాదకకార్యాలయం, తిరుపతికి తప్ప-మీరు ఎవరిదగ్గర డబ్బులు కట్టి, మోసపోకండి.

3) మనిఆర్డరు పంపేవారు - అందులోనే మీచందావివరాలు వ్రాసి, ఈ క్రింది చిరునామాకు పంపాలి.

4) మా చిరునామా "ప్రధాన సంపాదకుడు, సప్తగిరి కార్యాలయం, టి.టి.డి. ప్రెస్ కాంపౌండ్, కె.టి.రోడ్డు, తిరుపతి - 517 507".

5) ఇతర వివరాలకు ఫోన్ నెం.0877-2233333, 2277777.

# వైకుంఠపాళి 18

| 1 | | 2 | | 3 | ■ | 4 | | 5 |
|---|---|---|---|---|---|---|---|---|
| | ■ | | ■ | | ■ | | ■ | |
| 6 | | | | | ■ | 7 | | |
| ■ | ■ | | ■ | | ■ | | ■ | |
| 8 | | | 9 | ■ | 10 | | 11 | |
| | ■ | ■ | 12 | | | ■ | | ■ |
| 13 | | | | ■ | 14 | | | 15 |
| | ■ | ■ | | ■ | | ■ | ■ | |
| 16 | | | | ■ | 17 | | | |

**నిర్వహణ** టి.ఎస్.జగన్మోహన్

### నిలువు

1) ఫలాశనము(3); 2) శ్రీరామానుజులు (చిందరవందర యింది)(5); 3) ఉడుక (ఒకవాద్య విశేషం)(4); 4) ఏనుగుల మంద(5); 5) కైలాసం(5); 8) నాట్య శాస్త్రకర్త(5); 9) లక్ష్మీదేవి(5); 10) గణపతి దేవుని కుమార్తె(5); 11) నేలతల్లి (క్రింద నుంచి మీదికి)(3); 15)మాషము(3)

### అడ్డం

1) సూర్యుడు(5); 4) కెంబసువు(3); 6) ఒక ప్రసిద్ధ చోళ చక్రవర్తి(5); 7) తోలుసంచి (కుడినుంచి ఎడమకు)(3); 8) అభ్యుదయం(4); 10) ఐరావతం(4); 12) ఇంద్ర జిత్తు(3); 13) శ్రీరంగనాయకస్వామి క్షేత్రం(4); 14) పితృవనం(4); 16) తెర (చిందరవందరైంది)(4); 17) మొసలి(4)

జవాబులు ఈ సంచికలోనే ఉన్నాయి. అన్వేషించి... సరిచూసుకోండి.

- ప్రధాన సంపాదకుడు



Edited and published on behalf of T.T.Devasthanams by Dr. K.Radha Ramana, M.A., M.Phil., Ph.D., Chief Editor, T.T.D. and printed at T.T.D. Press by Dr.T.Ravi, M.A., Ph.D., P.R.O. & Dy. E.O.,(Publications & Press)FAC, T.T.D. Press, Tirupati - 517507.

